# అధ్యాయము-1

శ్రీ రామ రామ రామ

రాజారామ్

నా తల్లి, తండ్రి, సోదరుడు, సోదరి, స్నేహితులు, గురువు, దైవం అయిన "సుందరసాయి"కి మనః పూర్వకముగా వారి పాదములపై పడి సాష్టాంగ నమస్కారములు అర్పించుకొని ఈ సుందరకాండ ప్రారంభించుచున్నాను.

సాయి అంటే ఒక విశ్వం. అనంతం అనిర్వచనీయమైన రూపము. ఆది అంతము లేని నిశ్చల నిరాకార సర్వవ్యాపి అతీతమైన శక్తి కలిగి అంతట వ్యాపించి ఉన్న ఆ పరమాత్మ శ్రీసాయి నన్ను తన ఒడిలో లాగుకొని తన కరుణారస పాలును తల్లివలె త్రాగించి తల్లిప్రేమ చవిచూపినారు. నా పాలన వారు తండ్రివలె స్వీకరించినారు. నా జీవన గమనములో సోదరునిలా ఆదుకుంటూ నా వెంట ఉన్నారు. తన అపూర్వదయ, కరుణను ఒక సోదరి రూపమున దాల్చి వారి ఆశీర్వచనమును నా చేతికి రక్షా బంధనము కట్టి సోదరి ప్రేమ చూపినారు. నాయీ జీవిత ప్రయాణములో మిత్రుడిలా నాతో ఆడుకుంటూ నా సుఖదుఃఖములో మిత్రుడిలా నాతో ఆడుకుంటూ నా సుఖదుఃఖములను వారు సమానముగా పంచుకుని స్నేహితునిలా నా హితము కోరుచున్నారు. క్లిష్ట పరిస్థితులలో అగోచరమైన కార్యములలోనున్న పరిస్థితులలో నాకు నా గురు రూపమున శ్రీ మహాభాష్యం రంగాచారిగారు నా జీవితములో అడుగిడి చేయిపట్టి నా దారినే మార్చి గురువు సాక్షాత్ పరబ్రహ్మమని నిరూపించి నా నీడలా నన్ను ఆదుకుంటూ ఆధ్యాత్మిక మార్గములో నడిపించి నన్ను ఆశీర్వదిస్తూ నాతో అనునిత్యము ఉంటూ కాపాడుతున్నారు. ఇన్ని పరిస్థితులలో నన్ను ఆదుకుంటున్నప్పటికి ఒక్కొక్కసారి దైవము వైపు మనస్సు లాగుతున్నప్పటికి దైవము, గురువు మరియు జీవుడు వేరుకాదని సర్వజీవులు ఆ సాయి పరమాత్ముడే అని నా మనస్సుకు నచ్చచెప్పి మరల ఆ మనస్సును యధావిధముగా తానున్న చోటుకి మరల్చిన నా దైవమే శ్రీ సాయి అని సాయి అంతట ఉన్నారని శ్రీసాయి దైవ రూపములో నాకు బోధిస్తూ నన్ను ఆశీర్వదిస్తున్న ఆ సుందరసాయికి నమస్కారములు.

ఈ సుందరకాండ ప్రారంభానికి ముందు ఆ సుందరసాయిని ఈ విధముగా పూజిస్తున్నాను. సుందరసాయిని సింహాసనముపై కూర్చుండపెట్టి వారి తలపై కిరీటముపెట్టి వారి సుందర ముఖమునకు కస్తూరి నామమును ఆ మధ్య బొట్టును పెట్టి ఆ సుందరసాయి మెడలో నగలు వేసి పెద్ద పుష్పమాలను వేసి అలంకరించి వారికి కుచ్చుల ఛత్రమును పట్టుకుని వారి పాదములను మంచినీళ్ళతో, పాలతో, తేనెతో, పెరుగుతో, పన్నీరుతో నేయితో కడిగి వారి పాదములను శుభ్రముగా తుడిచి వారి చేతులకు గంధమును పూసి చక్కటి గులాబి పుష్పములను, వారి పాదములపై ఉంచి శ్రీసాయి దివ్యమైన అలంకారముతో కనిపించుచు ఆహా ఆ సాయి ఎంత సుందరముగా ఉన్నారో కదా అని అనుకొనునట్లు పూవులతో అలంకరించి సర్వలాంఛనములతో హారతినిచ్చి మేళతాళములతో స్వాగతము పలికి అత్తరు పన్నీరులతో వర్షము కురిపించి ఆ సాయి పాదములపై నా శిరస్సునుంచి నన్ను ఆశీర్వదించి ఈ సుందరకాండ వారే చెప్పుచుండగా కేవలము నేను వ్రాయుచున్నానని నా యీ కర్మను వారికి అర్పించి ఏ ఫలాపేక్ష లేకుండా నా యీ కర్మ వారి

పాదములపై ఉంచి ప్రారంభించుచున్నాను.

ఈశ్వర ఉవాచ :

శ్రీరామరామ రామేతి

రమేరామే మనోరమే

సహస్ర నామ తత్తుల్యం

రామనామ వరాననే (విష్ణు సహస్రనామం)

అర్థం పరమేశ్వరుడు తన అర్ధాంగి అయిన భవానికి ఇట్లు చెప్పుచున్నారు, " శ్రీరామునయందే నేను రమిస్తున్నాను. ఎల్లప్పుడు శ్రీరామ రామరామ అని అంటూ రామునియందే రమిస్తున్నాను. ఆ రామ నామం సహస్ర నామానికి సమానమైనది. అటువంటి రామ నామమునకు నమస్కారములు" అని ఈశ్వరుడు పలికినాడు.

'రామ' అనే నామం వినినంతనే గుర్తుకు వచ్చే దైవం శ్రీ ఆంజనేయుడు. ఆ ఆంజనేయుడు రామనామమును అనునిత్యముస స్మరిస్తూ 'రామరామ' అంటూ తన రోమములనంతట ఆ రామ నామమునే నింపుకుని ధ్యాన నిమగ్నుడై చివరికి నిదురలో కూడా రామరామ అంటూనే ఆ రామనామము తోనే మేల్కొని ఎన్నో ఊహించని కార్యములను రామనామ స్మరణతో జయించి అజేయుడైనారు మారుతి. రామనామముతో భజన చేస్తూ చప్పట్లు కొడుతూ ఒక్కొక్కసారి ఆ రామనామ స్మరణతో హనుమాన్ నృత్యముకూడా భక్తి పారవశ్యముతో చేసేవారు. సహస్రనామానికి సమానమైన ఆ రామనామమును ఆంజనేయుడు ఎన్ని సహస్రాలు చేశాడో లెక్కపెట్టుటకు మన జీవితము సరిపోదు. అమరజీవి వరమును శ్రీరాముని నుండి పొందిన ఆ చిరంజీవి ఇప్పటికి కూడా పుణ్య పర్వత ప్రదేశములలో రామనామాన్ని స్మరిస్తూనే ఉన్నారు. శ్రీరాముని హనుమంతుడు ఈ విధముగా కోరినారట. **"దేవా! నీ భువన మోహన మాయలో పడిపోకుండా నన్ను అనుగ్రహించు నీ పాద పద్మముల వద్ద శుద్ధ భక్తి కలిగేటట్లు అనుగ్రహమివ్వమ"**ని ఆ చిరంజీవి శ్రీరాముణ్ణి శరణాగతుడై వేడినారు. ఆ రాముని సంపూర్ణ అనుగ్రహముచే సహస్ర నామానికి సమానమైన ఆ రామనామమునే పూర్తి విశ్వాసముతో స్మరించి ముందుకు సాగినారు ఆ ఆంజనేయుడు. తాము విశ్వసించిన శ్రీరామ నామ బలముచేతనే సముద్రాన్ని లంఘించగలిగినాడు ఆ మారుతి. శ్రీరాముడు అదే సముద్రాన్ని దాటుటకు వారధిని నిర్మించినాడు. అయితే ఇందులోని రహస్యము ఆ నారాయణుడైన శ్రీరాముడు వారధిని నిర్మించవలసిన పనిలేదు. కాని హనుమంతుడు చెప్పినట్లుగా ఆ రాముని భువన మోహన మాయ అది కావుననే అటువంటి మాయ తప్పించుకొనుటకై ఆ మారుతి శరణాగతుడై శ్రీరాముని పాదపద్మాలను శుద్ధ భక్తిని కోరినారు కనుకనే రామనామము మీద సంపూర్ణ విశ్వాస బలము చేతనే సముద్రాన్ని లంఘించగలిగారు. దైవము అనుగ్రహిస్తే ఏదైనా జరగవచ్చునని ఋజువు ఇదే. హనుమంతుడు తిథి, వార, నక్షత్రాలు వేటిని పట్టించుకొనక కేవలము రామ చింతనతో రామనామ

స్మరణతో మునిగిపోయేవారు. ఒక్కొక్కసారి శ్రీరామునితో మారుతి ఇట్లనేవారు, **“ఓ రామా! నువ్వు పూర్ణమైతే నేను నీ అంశాన్ని. నీవు ప్రభువువు అయితే నేను నీ దాసుడను. తత్వజ్ఞానము కలిగినపుడు నువ్వే నేను, నేనే నీవుగా గాంచుతాను.”** ఇంతటి మహాబలవంతుడు శక్తి సామర్ధ్యాలు రామభక్తుడు తత్వజ్ఞానులు ధనం, గౌరవం, దేహసుఖం మరిదేనినైనను లక్ష్యపెట్టక తన ప్రభువు, గురువు, దైవం అయిన ఆ రాముని ఒక్కణ్ణే కోరిన మహానుభావులు తత్వజ్ఞాని అటువంటి హనుమంతుని మనోస్థితి ఎలాంటిదో సంపూర్ణముగా తెలిసికొనుటకు ఆ మారుతి మనోస్థితిని సుందరకాండలో పరీక్షించుటకు ప్రయత్నంచేద్దాం.

రాం రామాయనమః

# అధ్యాయము - 2

శ్రీ రామ రామ రామ

రాజారామ్

బ్రహ్మోవాచః

నమోస్త్వ నంతాయ సహస్రమూర్తయే

సహస్ర పాదాక్షి శిరోరు బాహవే

సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే

సహస్రకోటి యుగధారిణే నమః (విష్ణు సహస్రనామం)

అర్ధం : అంతములేనట్టి వేయి రూపాలతో వేయి పాదాలు, వేయి కనులు, వేయి తలలు, వేయి తొడలు, వేయి భుజాలు, వేయి నామాలు కలిగివున్న పరబ్రహ్మకు నమస్కారము.

ఈశ్వరోవాచ (శ్రీరామరామ రామేతి.....) ప్రకారము రామనామము సహస్ర నామానికి సమానమైనదని తెలిసికొంటిమి. ఆది అంతము లేనటువంటి వేయి రూపాలతో మరియు వేయి నామాలతో ప్రకాశించే ఆ పరబ్రహ్మమును ఒక్కసారి “రామ” అని స్మరిస్తే చాలునని తెలుస్తుంది. అటువంటి పరమ పవిత్రమైన శక్తివంతమైన రామనామాన్ని స్మరించి ఈ సుందరకాండ ప్రారంభించుచున్నాను.

రామనామము ఎంత గొప్పదో హనుమంతుడు ఎన్నో విషయాలలో ఋజువు చేసినారు. రావణుని వధ తదనంతరము శ్రీరాముడు సీతాదేవి మరియు లక్ష్మణ, భరత, శతృఘ్నులతో అయోధ్యకు తిరిగి వచ్చి రాజ్యపట్టాభిషేకము స్వీకరించి శ్రీరామునికి ఎంతో సహాయపడిన శ్రీ ఆంజనేయునికి శ్రీరాముడు అత్యంత ప్రీతితో మణిరత్నములు పొదిగిన హారమును సీతకు కానుకగా ఇచ్చినటువంటిది. సీతాదేవి మెడలో ఉన్న ఆ అమూల్యమైన హారమును సీతారాములు మారుతికి కానుకగా ఇచ్చిరి. అది చూసిన మారుతి తన వానర

చేష్టను ప్రదర్శించినారు. తన మెడలో సీతారాములు వేసిన ఆ మణిరత్న మాలను తన నోట్లో పెట్టుకుని రత్నాలను తెంపి క్రింద పారవేసినారు. కొన్నిటిని కొరుకుట ప్రారంభించినారు. ఈ వానర చేష్టను చూసిన సీతారాములు మారుతుని కారణము అడుగగా అప్పటివరకు వానర చేష్టలు ప్రదర్శించిన హనుమంతుడు. ఈ విధంగా జవాబు చెప్పినారు. **"స్వామీ బాహ్యపూజ ఆటంకమని"** ఒక్కసారిగా తన జ్ఞానాన్ని వానర రూపములో ఉన్న మహాజ్ఞాని మారుతి పలికినారు. పైగా ఆ రత్నాలను విరగకొట్టి అవి రాళ్ళలాగా ఉన్నాయని అందరి ముందు మారుతి పలుకగా శ్రీరాముడు మారుతి చేష్టలను గమనించి తన హృదయానికి హత్తుకొని ఆలింగనము చేసుకొని ఇట్లనినారు, "నీ మనసులో మాట ఏమిటో చెప్పుమని." శ్రీరాముని మాటలువిన్న మారుతి ఇట్లనెను, **"స్వామీ! నీ నామము ఎంతగా స్మరించినను నాకు తృప్తి అనిపించుటలేదు. కావున నీ నామమే నిరంతరము స్మరించుచూ భూతలమునందు నిలిచియుండునట్లు మరియు నీ నామము లోకమునందు ఎంతవరకు నిలుచునో నా శరీరము నిలిచియుండుగాక! ఈ వరమే నాకు అత్యంత ఇష్టమైనది"** అని మారుతి పలుకగా అక్కడ ఉన్న సభాముఖులేగాక శ్రీ సీతారాములతో సహా మారుతి భక్తికి ప్రసన్నులై ఆశ్చర్య చకితులైనారు. ఆహా రామనామము ఎంత గొప్పదో కదా. మారుతి ధనం, గౌరవం, దేహ సుఖం మరి దేనిని లక్ష్యపెట్టక శ్రీరామునిపై అనన్య భక్తిని ఆ రామనామ స్మరణమును నిరంతరము స్మరించవలెనని కోరిన మహానుభావులు. అటువంటి ఆంజనేయుని మనోస్థితిని మరి కొన్ని ముఖ్య విషయాలతో సుందరకాండలో చూద్దాం.

రాం రామాయనమః

# అధ్యాయము - 3

శ్రీ రామ రామ రామ

రాజారామ్

రామరామ అన్న రారాదు పాపంబు
రామరామ అన్న రారాదు భయము
రామరామ అన్న రారాదు మృత్యువు
రామరామ అనుము రక్షగొనుము

శ్రీరాముని నామము ఎంత మహిమాన్వితమో పై చెప్పిన శ్లోకము ద్వారా తెలియుచున్నది. అట్టి రామ నామమును లోకమునంత వరకు స్మరించవలెనని ఆ ఆంజనేయుడు సాక్షాత్తు విష్ణు స్వరూపుడైన శ్రీరామచంద్రుని నుండి వరము పొంది ఆ మారుతికి భయముకాని ఎటువంటి పాపములుకాని చివరికి మృత్యువు కూడా రాకుండా చిరంజీవిగా ప్రసన్నుడైన ఆ ప్రసన్నాంజనేయ స్వామి పాదపద్మములకు నమస్కారములు.

రామాయణము అందరికి తెలిసిన మహాపుణ్యకావ్యము. రామాయణము ఏడు కాండములుగా విభజింపబడియున్నది.

1. బాలకాండము, 2. అయోధ్యాకాండము, 3. అరణ్యకాండము, 4. కిష్కింధకాండము, 5. సుందరకాండము, 6. యుద్ధకాండము, 7. ఉత్తరకాండము.

ఈ విభాగములలో ఏదీ తక్కువకాదు. ప్రతికాండము నుండి ఎన్నో రహస్య విషయాలను గ్రహించవచ్చును. సువర్ణము ఒక్కటే కాని ఆ సువర్ణాన్ని వివిధ రూపములలో నగగా, గాజులుగా, వేలి ఉంగరముగా మొదలగు రూపములలో మరల్చినపుడు ఒక్కొక్క రూపములో ఒక సుందరము (అందము) కనిపించును. కాని మూలము సువర్ణమే. రామాయణము కూడా 7 భాగములుగా విభజించినను ఒక్కొక్క భాగములో సుందరము కనిపించును. కాని అది మనం చూచే విధానము బట్టి ఆ కాండములోని భావమును గ్రహించే దానిని బట్టి ఆస్వాదించుట జరుగును. అటువంటి 7 కాండములలో ఐదవ కాండమైన సుందరకాండము తీసికొని ఆ సుందర శ్యామసుందరుని దాసుడైన సుందర మారుతి యొక్క గుణగణాలను వికసింపచేయుటకై నాయీ ప్రయత్నము.

రామాయణములో సుందర రాముని అవతరాము అసలు ఎట్లు అవనిపై వచ్చెనో తెలుసుకొనుట ముఖ్యము.

రాక్షసగణముల భారముతో మరియు రాక్షస రాజైన రావణుని బాధతో భూమాత ఎంతో వ్యధచెంది గోరూపమున దేవతలతో సహా తన బాధను బ్రహ్మదేవునికి తెలుపుకుని ఉపాయము కోరెను. బ్రహ్మదేవుడు దేవతలను మరియు భూమాతతో సహా శ్రీహరిని ఆశ్రయించి తమ బాధను వెళ్ళబుచ్చెను. అంత శ్రీ మహావిష్ణువు ఇట్లనెను, "కశ్యపుని తపస్సుకు మెచ్చి అతనికి నేను పుత్రునిగా జన్మించెదనని వరము నొసంగినారు. **ఆ కశ్యపుడు ప్రస్తుతము దశరథ మహారాజుగా ఉన్నారు. అతని భార్యలు కౌసల్యాదేవి మరి ఇద్దరు రాణులకు నేను నాలుగు రూపములతో వేరు వేరుగా జన్మించి నన్ను నేనే సృజించుకొనెదను.** జనకుని ఇంట యోగమాయ కూడా అవతరించి ఆమెతో నేను మీ సర్వకార్యములను నెరవేర్చెదను." అని పలికెను.

శ్రీహరి మాట ప్రకారము కౌసల్యాదేవికి చైత్రమాస శుక్ల పక్ష నవమినాడు పునర్వసు నక్షత్రమున కర్కాటక లగ్నమందు మధ్యాహ్నం పరమాత్ముడైన ఆ మహావిష్ణువు జన్మించెను. ఆ సమయమున ఆకాశము నుండి పుష్పవాన కురిసెను. పుత్రరూపమున ప్రత్యక్షమైన ఆ సుందర బాలుడు నాలుగు భుజములు కలిగి కుండలములు ధరించి పీతాంబరుడై దివ్య తేజస్సుతో శంఖు, చక్ర, గద మరియు పద్మముతో ప్రత్యక్షమైన ఆ సుందరదేవుని చూచిన దశరథ మహారాజు భార్య కౌసల్య చేతులు జోడించి నమస్కరించినదట. ఆ మహావిష్ణువును స్తుతించి ఇట్లనినది, **"దేవేదిదేవా! నీవు నా గర్భమునందు జనించి నీ మాయచేత లోకములు మభ్యపెట్టి ఆ మాయా ప్రభావముచే మోహితులను చేయుచున్నావు. నేడు నీ పాద పద్మముల ఆశ్రయము లభించినది. నీ మాయ నన్ను ఆవరించకుండా చేసి నీ యీ రూపమును ఉపసంహరించుకుని బాల**

**రూపమున దర్శనము నిమ్మని"** కోరగా శ్రీహరి, "అట్లే అగునని ఆశీర్వదించి తన జన్మకు కారణము పృథ్వీ భారమును తొలగించుటకు రావణాది రాక్షసులను సంహరించుటకు నేనీ మానవరూపము దాల్చితినని" శ్రీహరి పలికినారు. **వెంటనే భగవానుడు పసిబాలుడై ఏడువ సాగెను.** దశరథమహారాజు మరి ఇద్దరి భార్యలకు లక్ష్మణ, భరత, శతృఘ్నులు జన్మించినారు. కౌసల్యకు పుట్టిన ఆ శ్రీహరికి రాముడని పేరు పెట్టినారు.

తదుపరి రఘుకులమునందు జన్మించిన నలుగురు పుత్రులలో రామలక్ష్మణులు విశ్వామిత్రునకు సహాయము చేయుట, ఆ మహర్షి చేసే యజ్ఞమును రక్షించుట, అహల్య శాపమును ముక్తి కలిగించుట, రాముడు శివ ధనుర్భంగము కావించి సీతను పరిణయమాడుట, పరశురాముని గర్వభంగము కావించుట, తండ్రిమాట జవదాటక అయోధ్యా నగరమును విడిచి వనవాసమునకు వెళ్ళుట, మారీచుని వధించుట, మాయ సీతను రావణుడు అపహరించుట, జటాయు పక్షికి ముక్తినిచ్చుట, శబరి భక్తి గైకొనుట, సుగ్రీవునితో మైత్రి చెంది వాలిని వధించుట, హనుమాన్ యొక్క సహాయ అన్వేషణతో లంకారాజ్యమును ముట్టడించి రాక్షసులను వధించి చివరికి రాక్షస రాజైన రావణుని కూడా వధించి లంకారాజ్యము విభీషణునికి అప్పగించి తిరిగి శ్రీహరి అయోధ్యా నగరము మరలి వచ్చిరి.

రాం రామాయనమః

# అధ్యాయము - 4

శ్రీ రామ రామ రామ

రాజారామ్

దైవీ హ్యేషా గుణమయీ మమ యాయాదురత్యయా

మామేవయే ప్రపద్యంతే మాయామేతాం తరంతితే (భగవద్గీత, అ–7, శ్లో. 14)

అర్థం : నా మాయ త్రిగుణాత్మకమైనది. అలౌకికమైనది. ఇది అధిగమించుటకు సాధ్యము కానిది. కాని కేవలం నిరుతరము నన్నే భజించువారు ఈ మాయను అధిగమించి సంసార సముద్రమునుండి బైటపడగలరు.

శ్రీ రామచంద్రుడు హనుమాన్ యొక్క సహాయముతో సీత యొక్క జాడ రహస్యమును కనుగొని లంకాపురమును ముట్టడించి ఆ లంకేశ్వరుని హతమార్చినాడని పైన చెప్పుకుంటిమి. శ్రీరామచంద్రుడు సాక్షాత్తు మహావిష్ణువు. ఆ మహావిష్ణువు, భూభారము రక్షించుటకు రాక్షసులను మరియు రావణాది వీరులను హతమార్చుటకు ఆ బ్రహ్మదేవునికి మరియు భూదేవికి వరమిచ్చి తన మాటను నిలుపుకొనుటకు మానవరూపము దాల్చి శ్రీరామనామ ధేయముతో దశరథ మహారాజుకు జన్మించి ఎన్నో కార్యములు చేసిన ఆ మహాపురుషుడు హనుమాన్ యొక్క సహాయముతో ఆ లంకేశ్వరుని వధించెనని అనుటలో ఆశ్చర్యము

కలుగును. అంతటి మహావతారము శివధనుర్భాణము విరిచినవారు, పరశురాముని గర్వభంగము కావించినవారు, విశ్వామిత్రునికి యజ్ఞ రక్షణ కల్పించినవారు, అహల్యకు శాపవిముక్తి కలిగించినవారు ఎందరో రాక్షసులను సంహరించిన, ఆ మహావిష్ణువు అవతారమగు శ్రీరాముడు శ్రీ ఆంజనేయుని యొక్క సహాయముతో లంకాపురమును ముట్టడించి రావణుని వధ కావించుటకు గల కారణము విష్ణుమాయే. ఆ ప్రభువుకి ఎవరి సహాయము అవసరము నిజానికి లేదు. కాని శ్రీ ఆంజనేయుని యొక్క వీరత్వమును ఆ హనుమాన్ గుణగణములను ప్రకాశింప చేయుటకై రాముడు ఆడిన నాటకమిది. పై చెప్పిన భగవద్గీత శ్లోకానుసారం విష్ణుమాయ త్రిగుణాత్మకమైనది. దానిని అధిగమించుట ఎవ్వరివల్లకాదు. కానీ భగవానుడు వెంటనే నిరంతరము నన్నే భజించువారు ఈ మాయను అధిగమించి సంసార సముద్రము నుండి బైట పడవచ్చునని పరమాత్ముడు చెప్పినట్లుగా మారుతి నిరంతరము ఆ శ్రీరాముని భజిస్తూ రామనామ స్మరణతో అనునిత్యము తపోనిమగ్నులై ఉండుటచే విష్ణుమాయను అధిగమించి సీతాన్వేషణ కొరకు ఆ హనుమంతుడు సముద్రమును దాటి రహస్యము తెలిసికొని శ్రీరామప్రభువుకు విన్నవించినారు. రామచంద్రుడు ఈ సంఘటన వలన మనకు బోధించినది ఏమనగా, హనుమాన్ వలె నిరంతరము పరమాత్మున్ణి భజించినచో మాయను అదిగమించ వచ్చునని ఋజువు చూపినారు. కావుననే అన్ని కార్యములు సాధించిన శ్రీరాముడు హనుమాన్ సహాయముతో లంకకు చేరి రావణుని వధ కావించినారని అనబడెను. సాధకులు తమ సంసార సముద్రము నుండి బైట పడుటకు ఈ కనిపించే జగత్తు, అందు జరిగే కార్యములు ఆ పరమాత్మ మాయేనని గ్రహించి ఆ మాయను అధిగమించుటకు నిరంతరము పరమాత్ముని భజిస్తూ స్మరించినచో మారుతి వలె సాధకులు కూడా విజయం సాధించవచ్చు. ఆ పరమాత్ముడు మనల్ని మరియు మనలోని గుణగణములను ప్రకాశింపచేయును.

రామాయణములో శ్రీరాముడు తన మాయను కప్పి ఒక సాధారణ పురుషునివలె ప్రవర్తించినారు. అయితే మహామునీశ్వరులు కొందరు ఆ మాయను గ్రహించి శ్రీహరిని పట్టుకొనిన సంఘటనలు కూడా ఎన్నో కలవు. కారణం ఆ మునీశ్వరులు కూడా ఆ సర్వేశ్వరుణ్ణి అనునిత్యం భజిస్తూ స్మరించుటచే విష్ణుమాయను అధిగమించగలిగినారు. ఉదాహరణకు రాముడు తండ్రిగారి ఆజ్ఞను పాలించుటకు సీతాలక్ష్మణ సమేతుడై వనవాసమునకేగి వాల్మీకి మహర్షిని సందర్శించి ఆ మహర్షితో ఇట్లనినారట. **"మహర్షీ నేను సీతాలక్ష్మణులతో కూడి నివసింపదగిన స్థానం తెలుపుము. అచ్చట కొంతకాలము నివసింపగలము"** అని అనగా మహర్షి ఇట్లనినారట. **"ఓ రామా! నేనెక్కడ నివసింపవలెనని నీవు నన్నడిగితివి. ముందు నీవు లేనిచోటును చూపుము" అప్పుడు నీవు ఉండవలసిన స్థలమునేను తెలిపెదను"** అని వాల్మీకి మహర్షి అనినారు. అలాగే శ్రీరాముడు భరద్వాజ మహర్షిని కలిసి **"మేము ఏ దారిన వెళ్ళవలెనో తెలుపుము"** అని రాముడు అనినంతనే భరద్వాజ మహర్షి తన మనస్సులో నవ్వుకొని **"నీకు అన్ని మార్గములు సుగమములే రామా"** అని అనినారట. శ్రీరాముడు అగస్త్యుని కలిసినపుడు ఇట్లనినారు, **"ఓ మహర్షీ! మునులను బాధించుచున్న రాక్షసులను హతమార్చుటకై తగిన మంత్రమును ప్రసాదించుము"** అని అనగా అగస్త్యముని ఇట్లనినారు, **"ఓ ప్రభూ! మీ మాయ ఒక పెద్ద మేడిచెట్టు వంటిది. సర్వం ఎరిగిన మీరు సామాన్య మానవుని వలె నన్నడుగుచున్నారు"** అని అన్నారట.

శ్రీ ఆంజనేయుడు అతీతమైన శక్తి సంపన్నులు తన శక్తి తానెరుగడు. తన గుణగణములు ఎంత గొప్పవో తానెరుగడు. ఒక వానరుని మనోస్థితి ఎలాంటిదో గోప్యముగా దాగియున్న దానిని ప్రకటితము చేయుటకై శ్రీరాముడు తాను నిముషములో తన అర్ధాంగి అయిన సీతాదేవి జాడను తెలుసుకొని లంకను ముట్టడంచి రాగల ధీరుడైనను ఆ కార్యమును వానరడైన మారుతికి అప్పగించి ఆ వానరుని మనోస్థితి బైట చూపుటకు ఆడిన మాయా నాటకమిది. అటువంటి గొప్ప మనోస్థితి కల్గిన ఆ సుందర ఆంజనేయుడు ఏవిధముగా లంకకు పయనమయ్యాడో అక్కడ జరిగిన కార్యములు హనుమాన్ గుణగణములు, మారుతి నడవడి, నమ్రత, ఔదార్యము గూర్చి చూద్దాం.

రాం రామాయనమః

# అధ్యాయము-5

శ్రీ రామ రామ రామ

రాజారామ్

శాన్తాకారం భుజగ శయనం

పద్మనాభాం సురేశం

విశ్వాధారం గగన సదృశం

మేఘవర్ణం శుభాంగం

లక్ష్మీకాంతం కమలనయనం

యోగి హృధ్యాన్య గమ్యం

వందే విష్ణుం భవభయహరం

సర్వలోకైక నాథమ్ ॥ (విష్ణుసహస్రనామం)

అర్థం : శాంతాకార స్వరూపముతో, ఆదిశేషుడిపై శయనించి, నాభిన కమలం ధరించినవాడు, సర్వేశ్వరుడు, విశ్వానికే ఆధారుడు, నింగికి సమానుడు, మేఘకాంతితో ప్రకాశించువాడు, లక్ష్మీదేవి పతియైనవాడు, పద్మములవంటి కన్నులు కలవాడు, యోగుల హృదయంలో ధ్యానరూపంగా వున్నవాడు, సంసార భయాన్ని నివారించేవాడు, సర్వలోక రక్షకుడు అయిన ఆ విష్ణు దేవునికి నమస్కరిస్తున్నాను.

శ్రీరాముడు తండ్రి దశరథ మహారాజు ఆజ్ఞ శిరసావహించుటకు సీతాదేవితో మరియు తమ్ముడు లక్ష్మణునితో కలిసి వనవాసమునకేగెనని మరియు రాక్షసరాజైన రావణుడు రామలక్ష్మణులులేని సయమున

సీతామాతను అపహరించి లంకకు తీసుకుని వెళ్ళి బంధించెననే విషయము తెలిసినదే. తల్లి సీతను రావణుడు అపహరించి లంకకు తీసుకువెళుతున్న మార్గమధ్యమున పక్షి జటాయువు రావణునితో కలబడి తన రెక్కలను పోగొట్టుకుని శ్రీరాముని రాకకై వేచి రావణుడు సీతను సముద్రము ఆవల ఉన్న లంకా నగరమునకు తీసుకువెళ్ళెనని చెప్పి తుదిశ్వాస విడిచెను. రామకార్యమును నెరవేర్చుటకు సీతాదేవిని రక్షించుటకు వానరసేనలు ఎందరో రామునికి సహాయముగా వచ్చిరి. అయితే లంకానగరము శతయోజన దూరమును సముద్రమునకు ఆవల ఉన్నది. ఆ సముద్రమును దాటి రామకార్యమును నెరవేర్చుటకు ఎవరు సరియైన వారోనని అనుకొనుచుండగా జాంవవంతుడు రామలక్ష్మణుల ముందు మరియు వానరసేనల ముందు ఇట్లనినారట, **“అచిర కాలములో కార్యసిద్ధి ఎవరి వలన జరుగునో నాకు తెలుసునని ఆ మహాబలశాలనిని నేను చూపించెద”**నని చెప్పి **అందరిలో ఏకాంతముగా ఏమీ తెలియని వానిలా ఎంతో ఉదాసీనుడుగానున్న హనుమాన్‌ని జాంబవంతుడు చూపించెను.**

పవనః పవతామస్మిరామః శస్త్రభృతామహమ్

ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ (భగవద్గీత, అ-10, శ్లో.31)

అర్థం : శ్రీ కృష్ణ పరమాత్ముడు తమ దివ్య విభూతుల విస్తృతికి అంతములేదని వాటిలో కొన్నింటిని విభూది యోగమున అర్జునునికుపదేశించెను. అట్టి దివ్య విభూతులలో ఒకటైనది పై శ్లోకము. శ్లోకార్ధమేమనగా పవిత్రమొనర్చు వానిలో వాయువును నేను. శస్త్రధారులలో శ్రీరామచంద్రుడను నేను, మత్స్యములలో మొసలిని మరియు నదులలో గంగను నేను.

శాంతముగా నున్న హనుమంతుని వానరసేనలు మరియు జాంబవదాదివీరులు చూచి జాంబవంతుడు హనుమంతునితో ఇట్లనెను, **“హనుమాన్ కార్యభారము నీపైనున్నది. నీవు సాక్షాత్తుగా వాయు పుత్రుడవు. వాయుదేవునిచే రామకార్యమును నెరవేర్చుటకు నీవు జనించినావు”** అని అనెను. పైన చెప్పిన విభూది యోగములోని శ్లోకము అర్ధమును ఒక్కసారిగా గమనించిన శ్రీ కృష్ణపరమాత్ముడు వాయువును నేను. శస్త్రధారులలో శ్రీరామచంద్రుడను నేను అని చెప్పుట గమనించవలసినది. హనుమాన్ వాయుపుత్రుడు అనగా సాక్షాత్తు ఆ మహావిష్ణువు అంశయే అని గమనింపవలెను. ఆ శ్రీహరి రెండు రూపములలో అనగా వాయుపుత్ర హనుమాన్ రూపమున మరియు శస్త్రధారి అయిన శ్రీరాముని రూపమున తన కార్యమును తనే నెరవేర్చుకొనుచున్నను తనమాయను అడ్డుపెట్టి వానరుడిచే చేయిస్తున్నట్లుగా చూపించెను. ఆంజనేయుడు మహాబలశాలి. రామకార్యార్థం కోసం జనించినవాడు. రామభక్తితో రామనామ స్మరణతో అతీతుడై మాయను అధిగమించుటచే అంతటి కష్టతరమైన కార్యమును ఎన్నుకొని సీతాదేవి జాడను తెలుసుకొనుటకు సముద్రమును దాటి లంకాపురమునకు ప్రవేశించుటకు సామర్ధ్యము గల వీరుడు ఆ హనుమాన్ ఒక్కడేనని నిరూపించుటకు శ్రీరాముడు జాంబవంతునిచే ప్రేరేపింపజేసి రామకార్యము నెరవేర్చుటకై ఆ కార్యభారమును హనుమాన్‌కి శ్రీహరి నొసంగినారు. మాయ త్రిగుణాత్మకమైనది. ఆ మాయను దాటుట ఎవరి వల్లకాదు. కేవలము భక్తివలన నిరంతర స్మరణ మరియు భజించుటచే ఆ మాయ అతిక్రమించవచ్చును. అట్లు

అతిక్రమించిన తరువాత మాయాతీతుడైన పరమాత్మ మరియు మాయను అతిక్రమించినవారు ఒక్కరే అయిపోతారు. జీవాత్మ పరమాత్మలో లీనమై మిగిలేది పరమాత్మేయగును. భగవద్గీత శ్లోకము ప్రకారము పవిత్రమొనర్చు వానిలో వాయువును నేను, శస్త్రధారులలో శ్రీరాముడను నేను అని చెప్పిన సత్యము హనుమాన్ మరియు శ్రీరాముని విషయములో నిరూపించబడినది.

ఆంజనేయుని మనోస్థితి ఎటువంటిదంటే తన శక్తి తానెరుగడు. అది ఒక యోగుల లక్షణము. యోగులు సహజముగా ఇంద్రియ నిగ్రహము కలవారై సర్వజీవులను సమాన దృష్టితో చూచుటేకాక సర్వజీవుల శ్రేయస్సును కోరేవారు అట్టివారే యోగులు. అటువంటి యోగులు మనోబుద్ధులకు అతీతమైన స్వరూపము కలవారు. నిశ్చలుడు, నిరాకారుడు అయిన పరబ్రహ్మమును పొందెదరు. హనుమంతుడు అటువంటి యోగి కావుననే పరబ్రహ్మము పొందెను. ఆ పరబ్రహ్మ కార్యభారమును నెరవేర్చుటకు అర్హతను పొందెను. హనుమంతుడు తన చిన్న వయసులోనే ఉదయించిన భానుని, చూచి ఒక ఫలమనుకొని ఆకాశమునకు ఎగిరి దానిని అందుకోవలెనని ప్రయత్నించిన మహాబలశాలి. అటువంటి ధైర్యసాహసాలను, పరాక్రమము జాంబవంతుడు హనుమంతునికి గుర్తుచేసి రామకార్యము నెరవేర్చుటకై సముద్రమును దాటి లంకాపురమునకు వెళ్ళమని జాంబవంతుడు మరియు వానరుల చేత అర్థించబడినారు.

రాం రామాయనమః

# అధ్యాయము - 6

శ్రీ రామ రామ రామ

రాజారామ్

ముకుంద మూర్ధ్నా ప్రణిపత్య యాచే

భవన్త మేకాంత మియంత మర్థమ్,

అవిస్మృతి స్త్వచ్చరణారవిందే

భవేభవే మేస్తు భవత్ప్రసాద్ (ముకుందమాల)

అర్థం : ఓ ముకుందా ! నిన్ను శిరముతో సేవించి నియమముగా ఇంత మాత్రమే యాచించుచున్నాను. ప్రతి జన్మనందు నీ అనుగ్రహముచేత నీ పాద పద్మములను మరువకుందునుగాక.

జాంబవంతుడు మరియు వానరసేనలు ఆంజనేయుని స్తుతించితన శక్తిని గుర్తుచేసిన పిదప మారుతి రామకార్యార్ధమునకై బయలుదేరుటకు సిద్ధమయ్యెను. రామభక్తుడు తన తల్లి జానకీ మాత జాడ తెలుసుకొనుటకు సంసిద్ధుడయ్యెను. తనతండ్రి వాయుదేవునకు, బ్రహ్మాదిదేవతలకు ఆంజనేయుడు

మహేంద్రగిరిపై తూర్పు ముఖమున నిలబడి సూర్యచంద్రాదులతో సహా నమస్కరించెను. ఆ రామభక్తుడు రామనామమును రోమరోమమున నిలుపుకొనినవాడు. రామ నామ పరవశుడై తన శరీరమును ఆ రామనామ స్మరణతో పెంచి దక్షిణ దిశగా ఉన్న లంకాపురమునకు బయలుదేరుటకు ఒక్కసారిగా కుప్పించి ఎగసినాడు.

తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే

ప్రియోపి జ్ఞానినో త్వర్ధమ్ అహం సచ మమ ప్రియః (భగవద్గీత, అ-7, శ్లో.17)

అర్థం : అర్ధార్ధులు, ఆర్తులు, జిజ్ఞాసులు మరియు జ్ఞానులు అనునవి చతుర్విద భక్తులు. ఈ చతుర్విధ భక్తులలో నిరంతరం నాయందే ఏకీభావ స్థితుడై అనన్య భక్తియుతుడైన జ్ఞాని అత్యుత్తముడు. ఏలయన వాస్తవముగా నన్ను తెలుసుకొనిన జ్ఞానికి నేను మిక్కిలి ఇష్టుడను. అతడును నాకు మిక్కిలి ఇష్టుడు.

ఆంజనేయుడు శ్రీరామభక్తుడు. అనునిత్యం రామనామ స్మరణతో శ్రీరాముని యందే ఏకీభావస్థితుడై అనన్యమైన రామభక్తి కలవాడు అగుటచే చతుర్విధ భక్తులలో పరమాత్మ ప్రాప్తినందిన జ్ఞాని. కావుననే ఆ జ్ఞానియైన ఆంజనేయునికి శ్రీరాముడంటే మిక్కిలి ఇష్టము. కావుననే రామ కార్యార్ధమునకై బయలుదేరినాడు. మరి అటువంటి జ్ఞాని అంటే ఆ పరమాత్మునికి కూడా ఇష్టము. కావుననే శ్రీరాముడు చతుర్విధ భక్తులలో జ్ఞాని గొప్పవాడని నిరూపించుటకు ఆ పరమాత్మ కార్యమును ఒక్క హనుమంతునికే దక్కించినారు. అంటే మారుతికి పరమాత్మ ప్రాప్తినందినది అని అర్థం.

రామనామ స్మరణతో వాయుపుత్రుడు వాయు వేగముకన్నా వేగముతో మహాకాంతియుక్తుడై వారధిని దాటుట ప్రారంభించినాడు. అంతటి మహాసముద్రముపై ఎటువంటి రహదారి కట్టలేదు. వారధిని ఏర్పరచలేదు. తాను నమ్ముకున్న రామనామముతో భక్తియుక్తుడై రామనామ స్మరణముతో కుప్పించి ఎగిసి సముద్రముపై గాలిలో దూసుకుపోతున్న ఆ మహావీర బలశాలి ఐన ఆంజనేయుని చూసి దేవతలు పూలవానను కురిపించినారు. ఆ ఆంజనేయుని కార్యమును చూచిన పర్వతరాజు బెదిరినారు. గుహలలో దాగియున్న భూతాలు కూడా భయపడినవి. గగన మార్గముతో పయనించుచున్న రామ భక్తుడు ఆంజనేయుని చూసి పలువురు ఆశ్చర్యముతో ప్రశంసిస్తూ రామభక్త హనుమాన్‌కి జై అంటూ సీత జాడను తప్పక తెలుసుకొని తిరిగి రాగల ధీరుడని ప్రసంశలు ఇచ్చినారు. రామ కార్యమునకై ఏగుచున్న రామభక్తుడైన హనుమంతుని సగరుడు సంతోషముతో మైనాకునికి కొన్ని సూచనలు ఇచ్చినారు. అవి ఏమనగా ఆ రామభక్తునికి స్వాగతము పలికి తన వద్ద పూజలందుకొని కొంత విశ్రాంతిని గైకొనమని మైనాకుడు, సగరుడు చెప్పినట్లుగా హనుమంతుని కడ నిలచి తన కొండపై శ్రమ తీర్చుకొనమనినారు. మరియు ఆ మైనాకుడు రకరకాల ఫలములను కందమూలములను మారుతికి అర్పించి తన పూజను అందుకొనమనగా **ఆంజనేయుడు అట్టి మెప్పులకు మరియు సత్కారములకు పొంగిపోలేదు.** అంతేకాకుండ రామకార్యార్ధమునకై ఎంతో సాహసమైన కార్యమును తలపెట్టి సముద్రమును దాటి లంకలో ప్రవేశించుటకు మరియు సీతాదేవి జాడ తెలుసుకొనుటకు కార్యము తలపెట్టెను. అట్టి కార్యములో ఎన్నో అవాంతరములు, దుఃఖములు ఎదురయ్యే అవకాశము ఎంతో కలదు. అయినను ఆ మారుతి అట్టి దుఃఖములకు కృంగిపోలేదు. **రామ కార్యార్ధము తప్ప ఏ కోరికా**

**కోరనూ లేదు.** అట్టి మహత్తర కార్యము జరుపుతున్నప్పుడు క్రోధమును, ఉద్వేగమును కూడా తన అదుపులోనే ఉంచుకొనినాడు ఆంజనేయుడు.

ఆంజనేయుని ఒక యోగిగా గుర్తించినాము. అట్టి యోగి జ్ఞానిగా మారుట తథ్యము. ఆంజనేయుడు జ్ఞానిగా కూడా పై సంఘటన ద్వారా నిరూపించబడినారు.

శక్నోతీహైవయః సోఢుంప్రాక్శరీ రవి మోక్షణాత్

కామక్రోదోద్భవం వేగం సయుక్తః స సుఖీనరః (భగవద్గీత, అ-5, శ్లో.23)

అర్ధం : జీవించియుండగనే, కామక్రోదాదులు ఉద్వేగములు అదుపులో ఉంచుకొనగల సాధకుడే నిజమైన సుఖి, యోగి

దుఃఖేష్వను ద్విగ్నమనాః సుఖేషు విగత స్పృహః

వీతరాగభయక్రోధః స్థితధీర్ముని రుచ్యతే (భగవద్గీత, అ-2, శ్లో.56)

అర్ధం : దుఃఖములకు కృంగిపోనివాడు, సుఖములకు పొంగిపోనివాడును ఆసక్తిని భయక్రోధములను వీడిన వాడును అట్టి ముని స్థిత ప్రజ్ఞుడనబడును.

ఆంజనేయుడిని ఒక యోగిగా, జ్ఞానిగా చూశాము. అటువంటి ఆంజనేయుడు రామకార్యార్ధమునకై ముందు రాబోవు దుఃఖములను గురించి ఆలోచింపక అట్టి రాబోవు దుఃఖములకు కృంగిపోలేదు. మైనాకుడు ఆంజనేయునికి ఫలపుష్పాదులతో అర్చనలతో స్వాగతము పలికి సేద తీర్చుకొనమని అడిగినపుడు అట్టి సుఖసత్కారములకు పొంగిపోలేదు. వేటిపైన ఆసక్తిని చూపలేదు. కామక్రోధాదుల ఉద్వేగములను అదుపులో ఉంచుకొని మునిగా స్థితప్రజ్ఞతను చూపి మారుతి యోగిగా, జ్ఞానిగానే కాకుండా ఒక మునియై తన స్థితప్రజ్ఞతను నిరూపించుకున్నారు. (ఇంతటితో ఈ అధ్యాయము సమాప్తం).

రాం రామాయ నమః

# అధ్యాయము - 7

శ్రీరామ రామ రామ

రాజారామ్

నూ మర్త్రోదయతే సనిష్యన్

యో విష్ణవ ఉరుగాయాయ దాశత్

ప్రయస్సత్రాచా మనసాయజాత

ఏతావన్తం నవ్యమావివాసాత్

(విష్ణుసూక్తము)

అర్థం : ఏ మానవుడు సత్వరము జీవితమున సమర్పణ బుద్ధికలిగి భక్తియోగము పొందుచున్నాడో, ఎవడు యజ్ఞార్థబుద్ధితో సకల కర్మలను తనవిగా తలపక విష్ణువునకు నివేదించుచున్నాడో అతడే ఉత్తమయజ్ఞము చేసినవాడు.

ఆంజనేయుడు రామకార్యార్థమునకై పోవుచుండగా ఆ వానరోత్తముని మైనాకుడు స్వాగతము పలికి సత్కారము చేయుట తలవగా హనమంతుడు ఆ సత్కారమునకు లొంగక మైనాకునితో ఇట్లనినారు, “ఓ గిరిరాజా నీ మర్యాదకు మరియు సత్కారమునకు నోచుకొనుటకు కాదు. నేను రామ కార్యమై ఏగుచుంటిని. ఆ రామ కార్యము నెరవేరునంతవరకు ఇటువంటి సత్కారములకు ప్రీతినొందను. ఆ రామకార్యము సాధించునంతవరకు నా పయనము ఆగదు. నాకు ప్రతీక్షణము ఎంతో విలువైనది. నాయీ రామకార్యార్థము సిద్ధించవలెనని నన్ను ఆశీర్వదించమని” మారుతి పల్కెను. హనుమంతుడు కేవలము రామ కార్యమునే సాధించవలెనని పట్టుదలతో తన దృష్టిని ఏ ఇతర కార్యములపై పడనీయక ఎటువంటి ఆడంబరములకు లొంగక నిరాడంబరుడుగా తన కార్యము సఫలీకృతము కావలెననే కాంక్షతో ప్రతీక్షణము కూడా రామకార్యమునకే కేటాయించుకొని ముందుకు సాగిపోతున్న మహానుభావుడు. అంతటి శక్తి సంపన్నుడు మనోనిగ్రహుడు శ్రీహరి సంపూర్ణ ఆశీస్సులు పొందిన మహానుభావుడు. అయినప్పటికిని తన రామకార్యము నెరవేరవలెనని మైనాకుని దీవెనను కూడా అడిగిన సరళ హృదయుడు మరియు అంతటి శక్తి సంపన్నుడు అయినను సామాన్య మానవుని వలె మైనాకుని అర్థించినాడు.

పై చెప్పిన విష్ణుసూక్తములోని శ్లోకమును ఒకసారి పరిశీలించిన మూడు రకములైన జీవులు ఉండెదరు. అందులో మొదటివారు ఇంద్రియార్థములైన సంపదలు తమవని జీవించేవారు, రెండవవారు అవన్నియు అశాశ్వతములని వైరాగ్య బుద్ధితో దైవచింతన కలిగి యజ్ఞాది సత్కార్యాల నాచరించేవారు. ఇక మూడవవారు ఈ రెండు విధములుగా జీవించువారియందు అంతర్యామిని చూసేవారు. అటువంటివారు ఉత్తములు అదే విష్ణుపదము లేదా పరమపదము అనియు చెప్పబడెను.

మారుతి తన జీవితమును రామకార్యమునకై సమర్పణ చేసినారు. కావున భక్తియోగము పొందినారు. రామకార్యము ఒక యజ్ఞముగా భావించి యజ్ఞార్థ బుద్ధితో తన కర్మలను తనవిగా భావింపక తన దైవమగు శ్రీరామునికి నివేదించినారు. అతని రామకార్యమగు యజ్ఞము ఎంతో గొప్పది. అట్టి ఉత్తమమైన యజ్ఞమును కావించుటకు పయనమైనారు పై చెప్పబడిన విష్ణుసూక్తములోని శ్లోకమును దాని అర్థమును ఒక్కసారి పరిశీలించిన "ఏ మానవుడు సత్వరము జీవితమున సమర్పణ బుద్ధి కలిగి భక్తియోగమును పొందుచున్నాడో ఎవడు యజ్ఞార్థ బుద్ధితో సకల కర్మలను తనవిగా తలంపక హరికి నివేదించుచున్నాడో అతడే ఉత్తమ యజ్ఞము చేసినవాడు." మారుతి తన అంతర్యామియైన శ్రీరాముని చూచుచు విష్ణుపదమును లేదా పరమ పదమును పొందినారు. కావున మారుతి చేయు యజ్ఞము విష్ణుసూక్తము శ్లోకములో చెప్పినట్లుగా ఉత్తమమైన యజ్ఞము చేసినారు.

ఇట్లు మారుతి రామకార్యమునకై పోవుచుండగా ఆకాశ మార్గమున పవన కుమారుని కనిపెట్టిన దేవతలు మారుతి కార్యము ఎంతో సాహస కృత్యముతో కూడినదని పైగా రాక్షసుల బలము అతి భయంకరమైనదని రామకార్యము మారుతి నెరవేర్చుటకుగల శక్తి సామర్థ్యములు ఎంతవరకు ఉన్నవోనని గ్రహించుటకు దేవతలు పరీక్షింపబోయి సురసను పంపెను. దేవతల ఆజ్ఞపై నాగమాత సురస హనుమంతుని అడ్డగించి మ్రింగుటకు సిద్ధమయ్యెను. ఆంజనేయుడు వినయముతో చేతులు జోడించి ఇట్లనెను, "రామకార్యమునకు పోవుచున్న నన్ను ఆపుట న్యాయము కాదు. మరియు సమయము అసలేకాదు. సీతామాత జాడను తెలుసుకొనుటకు ప్రయాణమైతిని. ఆ మాత జాడను తెలుసుకొనిన పిమ్మట తండ్రి శ్రీరామునకు తెలిపి కావాలంటే తిరిగి మరలి వచ్చి నీ నోట పడెదనని" మారుతి పల్కెను. మారుతికి ఉన్న బలము చూసిన తాను ఆ విధముగా చేతులు జోడించి వినయపూర్వకముగా ఒక బలహీనుడువలె విన్నతిని విన్నవించుకొని తిరిగి వచ్చి నోట పడెదనని అన్నాడే కాని పౌరుషముతో క్రోధాగ్నిచే సురసతో దెబ్బలాడలేదు. **నిజానికి వాయు పుత్రుడు తలచిన సురస గతి ఏమయ్యేది ?** హనుమంతుడు సీత జాడ తెలుసుకొని తండ్రి శ్రీరామునికి చెప్పి వచ్చెదనని "స్వామి సాక్షిగా" అని పల్కెను. మారుతి ఎంత నిజాయితి మరియు ధర్మపరుడో కదా. సురస మారుతి ప్రవర్తనను చులకనచేసి తన నోటిని తెరచి మ్రింగుటకు సిద్ధముకాగా మారుతి తన కాయమును ఒక్కసారిగా పెంచెను. అది చూసిన సురస తన కాయమును ఇంకనూ పెంచెను. సురస కాయముతోపాటు తన ముఖము మరియు నోరును పెద్దది చేయగా మారుతి వెంటనే బొటన వేలెడంతై ముఖము జొచ్చి బైటకు వచ్చెను. సురస మారుతి బుద్ధిని గ్రహించి తన నిజరూపమును చూపి దీవెన లొసగెను.

రాం రామాయనమః

# అధ్యాయము-8

శ్రీ రామ రామ రామ

రాజారామ్

బ్యాపి రాహెఉ సంసార మహు మాయా కటక ప్రచండ

సేనాపతి కామాది భట దంభ కపట పాషండ

సోదాసీ రఘుబీరకై, సముఝే మిద్యా సోపి

ఛూట న రామ కృపా బిను నాథ కహఉ పదరోపి  (రామచరిత మానసము)

అర్థం : మాయ యొక్క ప్రచండ సైన్యం జగత్తునంతా నిండియున్నది కామక్రోధాదులు దాని సేనాపతులు. దంబము, కపటము, పాషాండత్వము దాని యోధ గణములు. అయినను ఆ మాయ రామునికి దాసి. ఇది అంతయు మిథ్య అని గ్రహించినను రాముని కృపలేనిదే ఆ మాయ వదలదు.

మాయ యొక్క సురస దీవెనలు పొంది తిరిగి తన ప్రయాణము ఆకాశమున రేగుచుండగా క్రిందనున్న సంద్రములోని రాక్షసి సింహిక మారుతిని చూచి తన నోటిని తెరచిలోనికి మ్రింగుటకు ప్రయత్నించెను. మారుతికి తిరిగి ఆటంకము వచ్చుట చూచి తిరిగి మారుతి సూక్ష్మరూపుడై సింహిక ముఖమును చీల్చి వెలికివచ్చెను. మారుతి దెబ్బకు సింహిక ప్రాణము విడిచెను.

మయిసర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా

నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగత జ్వరః     (భగవద్గీత, అ–3, శ్లో.30)

అర్థం : అంతర్యామిని, పరమాత్మను అయిన నాయందే నీచిత్తము నుంచి కర్మలన్నింటిని నాకే అర్పించి ఆశ, మమత సంతాపములను వీడి యుద్ధము చేయుము.

సుఖదుఃఖే సమేకృత్వా లాభాలాభౌ జయా జయౌ

తతో యుద్ధాయ యజ్యస్వ నైవం పాపమవాపస్స్యసి(భగవద్గీత అ–2, శ్లో.38)

అర్థం : జయాపజయాలను, లాభనష్టములను, సుఖదుఃఖములను సమానముగా భావించి యుద్ధ సన్నద్ధుడవుకమ్ము. అప్పుడు నీకు పాపములు అంటనే అంటవు.

భగవద్గీతలోని పై రెండు శ్లోకములలో భగవానుడు చెప్పినదేమనగా "నాయందే నీ చిత్తము నుంచి కర్మములన్నింటిని నాకే అర్పించి ఆశ, మమత, సంతాపములను వీడి మరియు జయాపజయములను లాభనష్టములను సుఖదుఃఖములను సమానముగా భావించి యుద్ధము చేయమని అట్లుచేసిన పాపములు నీకు అంటవని భగవాన్ చెప్పినారు.

హనుమంతుడు శ్రీరాముణ్ణి అంతర్యామిగా తలంచి తన పరమాత్మ అయిన రాముని మీదే తన చిత్తము నుంచి రామ కార్యార్థమునకై బయలుదేరి తన కర్మలన్నింటిని తన దైవమైన ఆ రాముడికే అర్పించినాడు. సింహిక రాక్షసి అడ్డుపడినప్పుడు తన కార్యముపై ఉన్న ఆశకాని మమతకాని ఏ కారణము చేతనైనా ఆ రాక్షసితో ఓడెదననే సంతాపముకాని చెందక ఆశ మమత మరియు సంతాపములను వీడి సింహిక రాక్షసితో యుద్ధము చేసెను. యుద్ధము చేయుచున్నప్పుడు కూడా వారిరువురిలో ఎవరు జయించెదరో జయము ఎవరికో అపజయమెవరికో అందలి లాభనష్టములు మరియు సుఖదుఃఖములను కూడా సమానముగా భావించి యుద్ధము కావించెను. భగవద్గీతలో నారాయణుడు చెప్పినట్లుగా అట్లు యుద్ధము కావించిన వారికి పాపములంటవని కావున హనుమంతునికి గీతా శ్లోకానుసారముగా యుద్ధము కావించినాడు కనుక ఆ యుద్ధములో సింహిక హృదయము చీల్చి చంపినను మారుతికి ఎటువంటి పాపములు తగలలేదు.

సింహికను సంహరించిన మారుతి లంకకు తిరిగి పయనమయినాడు. తన వేగమును పెంచి సీతాదేవి జాడ తెలుసుకోవాలనే కాంక్షతో రామ కార్యమును నెరవేర్చవలెనని జిజ్ఞాసతో అతివేగముగా ఆకాశములో దూసుకుపోతున్న వాయుపుత్రుడు లంకాపురమునకు దగ్గరలో చేరువైనారు. రావణుడు పరిపాలించు లంకా రాజ్యము సమీపించినది. ఎన్నో రకాల చెట్లు కనిపించినవి. ఆ చెట్లు రకరకాల పూలవి మరియు అనేక రకములైన ఫలాలలతో నిండియున్నది చెప్పలేని ఆనందమయమైన తోటలు కాంచినారు మారుతి. నారికేళములు, ఖర్జూరములు పలురకాల పళ్ళ రసాలతో నిండినది ఆ తోట.

యుక్తాహార విహారస్య యుక్తచేష్టస్య కర్మసు

యుక్త స్వప్నావభోదస్య యోగో భవతి దుఃఖహా (భగవద్గీత అ–6, శ్లో. 17)

అర్థం : ఆహార విహారాదులయందును కర్మాచరణములయందును, జాగృత్, స్వప్నాదులయందును యధాయోగ్యముగ ప్రవర్తించువానికి ధ్యానయోగము సిద్ధించును.

యదా వినియతం చిత్త మాత్మన్యేవా వతిష్ఠతే

నిఃస్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్చతే తదా (భగవద్గీత అ–6, శ్లో. 18)

అర్థం : చిత్తమును పూర్తిగా వశమునందుంచుకొని ఆ చిత్తమును సర్వేశ్వరుడి యందే స్థిరముగా నిలిపిన వానికి సర్వభోగములయందును స్పృహారహితుడగును. అతడే యోగ యుక్తుడనబడును.

పై భగవద్గీతలోని రెండు శ్లోకములను పరిశీలించగా హనుమంతుడు వానరుడు. సహజముగా వానరుడికి ఫలాలంటే ఎంతో ఇష్టం. అటువంటిది ఒక్కసారిగా ఎన్న రకాల ఫలాలు, దుంపలు, కాయలు, రసఫలాలు ఎదురుగా లెక్కలేనన్ని మారుతికి కనబడినను తన చిత్తమును పూర్తిగా వశమునందుంచుకుని తన పరమాత్మయైన శ్రీరామునిపై తన చిత్తమును నిల్పి ఆహార విహారాదుల యందును యధాయోగ్యముగా ప్రవర్తించి శ్రీరామునిపై ధ్యానయోగమును సిద్ధింపచేసుకుని కనిపించే సర్వభోగముల యందును

స్పృహారహితుడయ్యెను.

ఆ తోటలో చక్కటి జలధార మరియు రకరకాల జలపక్షులు మరియు పక్షులు ఎన్నో రకాల పూల చెట్లనుకూడా కాంచినారు మారుతి. అచ్చటి వాతావరణము ఎంతో ప్రశాంతముగా రమణీయముగా కన్నుల పండుగగా తోచెను మారుతికి. శ్రీరాముడు పాలించే రామ రాజ్యములో ప్రశాంతత రమణీయము మరియు రకరకాల ఫలపుష్ప జలపక్షుల దృశ్యములు ఏ విధముగా ఆనందము కలిగియున్నదో అదే ఆనందము మరి రాక్షస రాజైన లంకేశ్వరుడు రావణుడు పరిపాలించే లంకా రాజ్యములో కూడా ఉండుట ఏమిటి ? అనే ప్రశ్న వస్తుంది. అదే శ్రీహరి లీలంటే **శ్రీహరి రామరాజ్యములోను, లంకాపురములోను దేవతలలో దేవతాశక్తిగా మరియు దానవులలో దానవశక్తిగా తానే యుండి ఆపై దేవతలలో తానొకడిగా ఉండి తన లీలను చూపెదరు.** పరమాత్మ సర్వప్రాణులలో సర్వవ్యాప్తిగా నిండి ఉండునని నిదర్శనము ఇంతకంటే ఏమికావాలి. నారాయణుడు సర్వజీవులలో, చెట్లలో, పువ్వులలో, ఫలాలలో పంచభూతాలలో నోరులేని జీవులలో మానవులలో దానవులలో కూడా ఆ పరమాత్మ ఆత్మగా కొలువై ఉంటాడు. కావున ప్రశాంతత అనేది సర్వవ్యాప్తిగా ఆ పరమాత్మ వ్యాపించే ఉన్నాడు. మనము చూసే దృష్టిని బట్టి మనము భావించే సంకల్పాన్ని బట్టి ఆధారపడియుండును. లోపల పరమాత్మ ఆత్మరూపేణా సాక్షిగా ప్రతి అణువులో దాగియున్నాడు. మనం ప్రవర్తించే సంస్కారము దుష్టకార్యములు ఆ పరమాత్మకు ఏమీ అంటవు. తాను సాక్షిగానే ఉంటాడు. కావున భగవంతుడు చెప్పేది ఒక్కటే. "సర్వజీవులయందు పరమాత్మను చూడమన్నారు. అప్పుడు శత్రువు, మిత్రుడు, ప్రియుడు, అప్రియుడు అనే ద్వైత భావన ఉండదు.

రాం రామాయనమః

# అధ్యాయము-౨

శ్రీ రామ రామ రామ

రాజారామ్

మేఘ శ్యామం పీతకౌశేయవాసం

శ్రీవత్సాంకం కౌస్తుభోద్భాసితాంగం

పుణ్యోపేతం పుండరీకాయతాక్షం

విష్ణుం వందే సర్వలోకైకనాథమ్ (శ్రీ విష్ణు సహస్రనామం)

అర్థం : మేఘ వర్ణము కల శరీరుడు పచ్చటి పట్టువస్త్రము ధరించినవాడు, శ్రీవత్సమనే పుట్టు మచ్చకలవాడు, కౌస్తుభమణితో ప్రకాశించే దేహము కలవాడు, విశాలమైన కమలములవంటి నేత్రములున్నవాడు, సర్వలోకేశ్వరుడు అయిన శ్రీహరికి నమస్కరిస్తున్నాను.

మారుతి లంకాపురమునకు వచ్చినారు. అతిభయంకరమైన సముద్రమును దాటి లంకకు చేరినారు. మహేంద్రగిరిపై రామునికి తన పరివారమునకు నమస్కరించి కుప్పించి అక్కడ ఎగిసిన మారుతి ఆకాశములో అతివేగముగా పయనిస్తూ క్రిందనున్న అతివిశాలమైన ఎంతో పెద్దదైన సముద్రములో పడకుండా సముద్రాన్ని దాటి లంకకు చేరిన ఆంజనేయుడు అంతటి కార్యము నెరవేరుటకు గల కారణము తన దైవమైన శ్రీరాముడేనని ఆ రామనామ స్మరణముతో అంతటి సముద్రాన్ని దాటగలిగినాడని అనుకొని మనస్ఫూర్తిగా మారుతి శ్రీరామునకు నమస్కరించినాడు. రావణుడు పరిపాలించే లంక ఎదురుగా కనబడినది. అంతా బంగారముతో నిండినది ఆ నగరము. చివరకు గోడలు కూడా స్వర్ణముతో కట్టబడినవి. ఇక లంకానగరములోని వీధులు చాలా విశాలముగా ఉన్నవి. ఆ లంకానగరములో ఎటు చూచినా ఎత్తైన మేడలు అందమైన గృహములు అచటి దానవులు ఆయుధములు ధరించి అతి భయంకరముగా ఉన్నారు. వాళ్ళు కామరూపులు, కిరాతకులు, అతి బలిష్ఠులు. వారి చేతులలో కత్తులు భయంకరమైన ఆయుధాలతో ఆ లంకాకోట చుట్టు తిరుగుచున్నారు. ఆ రాక్షసులు స్నేహముతో లొంగేవారుకారు. అట్టి భయానక రాక్షసులు తిరిగే లంకా నగరమునకు వచ్చినారు ఆంజనేయుడు. పైగా మారుతి వచ్చిన సమయము రాత్రివేళ చిమ్మచీకటితో నిండినది. ఆ చీకటిలో ఆకాశములో నక్షత్రముల తళుకులు లింకానగరములోని గృహములు మరియు ఆ లంకాపురముకోట స్వర్ణకాంతుల వలన చిక్కటి చీకటిలో ప్రకాశవంతముగా వెలుగుచున్నది ఆ లంకాపురము. ఆంజనేయుడు తనరాకను రాక్షస వీరులు గమనించెదరని ఉద్దేశ్యముతో సూక్ష్మరూపమును ధరించి ముందుకు బయలుదేరినాడు ఆ బలపరాక్రమశాలి వాయుపుత్రుడు. అంతటి సముద్రమునే దాటిన వీరుడు ఆంజనేయుడు సమయస్ఫూర్తితో తన పరాక్రమము పక్కకుపెట్టి రామకార్యార్థమునకై పిల్లివలె పొంచి మెల్లమెల్లగ ముందుకసాగినాడు సూక్ష్మరూపధారి ఆ మారుతి. హనుమాన్ లంకానగర ఉత్తర ప్రాకార ద్వారమునకు చేరినాడు. ఆ ద్వారము వద్ద అతిభయంకరమైన రాక్షసి పొంచియున్నది. మారుతిని చూచినది. ఆ రాక్షసి లంకారాక్షసి. మారుతిని చూచిన ఆ లంకారాక్షసి ఒక్కసారిగా గర్జించినది. మారుతికి అడ్డముగా నిలిచి ఇట్లు పలికినది. "కొండలలో, కోనలలో, చెట్లపై గంతులువేసే వానరుడువునీవు. ఈ లంకాపురములో నీకేమి పని ? ఏ కార్యమునకై ఇక్కడకు వచ్చితివి ? లంకాధిదేవతను నేను. నిజము చెప్పకున్నచో నీ ప్రాణములకే ముప్పు" అని పలికిన లంకా రాక్షసిని చూసి మారుతి ఎటువంటి కోపము, పౌరుషము చెందక మరియు ఆ రాక్షసితో కలబడక సౌమ్యముగా ఇట్లు పలికినాడు ఆ ఆంజనేయుడు, "ఓ లంకారాక్షసీ! ఈ లంకాపురము ఎంతో అందమైనదని ఇక్కడ ఉన్న గృహములను, కోట బురుజులను, సుందర వీధులను చూచుటకే వచ్చినానని అతిసుందరమైన లంకాపురమును చూచి తిరిగి వెళ్ళిపోవుదునని ఇంత మాత్రమునకు నీవు నాపై కోపగించకొనవద్దని" ఆంజనేయుడు శాంతముగా చెప్పినాడు.

విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని

శునిచైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః (భగవద్గీత అ-6, శ్లో. 18)

అర్థం : జ్ఞానులు విద్యావినయ సంపన్నుడైన బ్రాహ్మణునియందు, గోవు, ఏనుగు, కుక్క మొదలగు

వానియందును, చండాలిని యందును సమదృష్టినే కలిగియుందురు.

ఆంజనేయుడు మహాజ్ఞాని. లంకాపురమునకు ప్రయాణమైనపుడు మైనాకుడు సత్కారము తలపెట్టినప్పుడు అట్టి వినయ సంపన్నుడి యందును మరియు లంకాపురమునకు ప్రవేశించినపిదప లంకారాక్షసి (ఛండాలిని) ఎదురైనప్పుడు ఇద్దరియందు సమదృష్టి చూపినాడు కావుననే మారుతి జ్ఞాని.

మారుతి నమ్రతను నెమ్మది పలుకులను వినిన లంకారాక్షసి మారుతిని తక్కువగానెంచి బెదిరిస్తూ గర్జించి కొట్టెను. ఆంజనేయుడు తన కాయమును కొండంతగా పెంచి సింహగర్జనచేసి తన ఎడమ హస్తమునెత్తి పిడికిలి బిగించి ఒకే ఒక దెబ్బ లంకారాక్షసిని కొట్టెను. ఆ దెబ్బ ధ్వనికి చుట్టుప్రక్కల కంపించినట్లు అయి కొండంత రూపలుగల ఆ లంకా రాక్షసి కుప్పగూలి క్రిందబడెను. ఆ లంకారాక్షసి నోరు తెరచి కనులప్పగించి మారుతినే చూస్తు ఉండిపోయెను. ఆంజనేయుడు ఆ ఒక్కదెబ్బతో చాలించినాడు. **ఒక స్త్రీని చంపుట ధర్మము కాదని తలచినాడు.** ఆ లంకారాక్షసిపై దయచూపినాడు. వానరునికి ఎంతటి ధర్మ ఆలోచనో కదా! నిజానికి వానరులు యుద్ధము వచ్చినపుడు ఏది ధర్మమో, అధర్మమో చూడరు. కాని ఈ వానరుడు రామభక్త పరాయణుడు. **రామనామ స్మరణతో తన మనోస్థితినే మార్చుకున్నాడు. ధర్మాన్ని పాటిస్తూ ఇంద్రియ నిగ్రహుడై కామక్రోధ ద్వేషాదులకు స్వస్తి చెప్పి అనవసరముగా వాటిని అమలుపరిచవాడు కాదు.**

యస్మాన్నో ద్విజతే లోకో

లాసి కాన్నద్విజతే చయః

హర్షామర్ష భయోద్వేగైః

ముక్తోయస్స చయే ప్రియః(భగవద్గీత)

అర్ధము : లోకమున ఎవరికిని ఉద్వేగము కల్గింపనివాడు, ఎవరి వలనను తాను ఉద్వేజితుడు కానివాడు, హర్షము, ఈర్ష్య, భయము, ఉద్వేగము మున్నగు వికారములు లేనివాడును అగు భక్తుడు నాకు ప్రియుడు.

లంకకు ప్రవేశించిన ఆంజనేయుని లంకా రాక్షసి అడ్డగించినను ఆంజనేయునిపై గర్జించినను, హనుమంతుడు తన ఆగ్రహమును నిశ్చలము చేసుకొని తన మనోస్థితి ఎటువంటిదో బైటపెట్టినారు. అలా అని భయకంపితుడును కాలేదు. ఈర్ష్య, క్రోధము మొదలగు వికారములకు గురికాలేదు. పై భగవద్గీత శ్లోకానుసారము అటువంటి భక్తుడే భగవంతునికి ప్రియుడని కావుననే శ్రీరామునికి అనన్య భక్తునిగా చరిత్రలో చిరస్థాయిగా ఉన్నాడు ఆ ఆంజనేయుడు.

లంకా రాక్షసి మారుతి కరుణకు మరియు మారుతి మనోస్థితిని మెచ్చి క్షమాపణ కోరినది. పైగా తన అహంకారమును వదిలి ఇట్లనెను, "ఓ హనుమాన్! లంకానగరమును కాచే అతిబలమైన రాక్షసినేను. అంతటి లంకానగర మొత్తమును రాత్రింబవళ్ళు కాపుకాచే దానినంటే నా శక్తి ఎటువంటిదో నీవు

ఊహించగలవు. అంతటి శక్తివంతురాలనైన నన్ను నేల కూల్చితివి. ఓటమి ఎరుగని నాకు **ఓటమి అంటే ఏమిటో చవిచూపితివి. ఈ నా ఓటమి లంకా రాజ్యమునకే చేటని** ఇది వరకే బ్రహ్మదేవుడు వరమొసగెనని కావున లోనికి స్వేచ్ఛగా పొమ్ము, సీతాదేవిని అపహరించిన రావణునికి మరియు రాక్షస వీరులందరికి కాలము మూడినది. సీత మూలముగ వాళ్ళందరు అంతము చెందెదరని" లంకా రాక్షసి హనుమంతుని మరింత ఉత్సాహపరచి లోనికి పంపెను.

రాం రామాయనమః

# అధ్యాయము-10

శ్రీ రామ రామ రామ

రాజారామ్

యత్ర తద్విష్ణు ర్మ హీయతే

నారాయణ మధిపతిమ్

యత్ర శంఖచక్ర గదా

ధర స్మరణం ముక్తిశ్చ

తత్ర మా మమృత కృది (విష్ణు సూక్తము)

అర్థం : ఎచ్చట నారాయణుడును అధిపతిని విష్ణువు అంతర్యామిగా విస్తిరించుచున్నాడో ఎచ్చట శంఖు చక్ర గద ధరించిన వాని ధ్యానము మోక్షము సిద్ధించునో అచ్చట నన్ను శాశ్వతునిగ నిలుపుము.

లంకా రాక్షసి హిత వచనములను వినిన మారుతి నెమ్మదిగ కోటగోడను దాటిలోనికి దుంకినాడు. అది రాత్రివేళ వెన్నెల ఎంతో ప్రకాశవంతముగ చల్లని గాలితో వీచుచున్న సమయము. ఆ వెన్నెలలో లంకాపురము ఇంకెంతో ప్రకాశవంతముగ రమణీయముగ కనబడుచున్నది. లంకాపురములోని ప్రతి గృహ తోరణములు ముత్యముల తోరణములతో కళకళలాడుచుండెను. మరియు లంకాపుర వీధులు ఎంతో రమణీయముగా కనపడుచుండెను. మారుతి తన ఎడమ పాదమును ముందుపెట్టి లంకాపురములో ప్రవేశించెను. లంకాపురములో ఒక వైపునుండి నృత్యగీతములు మరియొక వైపునుండి నవ్వులు వినిబడుచుండగా అచ్చటి స్త్రీలు అప్సరసల వలె కనిపించినారు. మరికొన్ని చోట్ల గానాబజానాలు వినబడుచున్నవి. గజ్జల చప్పుళ్ళు ఒడ్డాణపు చప్పుళ్ళు వినిపించుచున్నవి. మరియొకచోట వేదములు అధ్యయనము చేయుచున్న ఋషులు కనబడినారు. ఇంకొద్దిగ ముందుకుపోయిన పిదప మారుతికి అగ్ని గుండములు మారణహోమములు చేయుచున్న మాంత్రికులు దర్భలు పట్టినవారు గుండు చేసుకొనిన

వారు అగుపించారు. ఇక రాక్షసుల రూపాలు చెప్పనక్కరలేదు ఎంతో వికారముగా భయంకరముగా ఉన్న రాక్షసులెందరో కొందరికి ఒంటికన్ను, ఒకే చెవి, చేతులలో భయంకర ఆయుధాలను ధరించి పెద్ద పొట్ట కలిగినవారు కలరు. కొందరు కామరూపాలతో చిమ్మచీకటిలో కలిసిపోయినటువంటి నల్లని ఆకారములతో తిరుగుచు మరికొందరు స్త్రీలోలురు మాంసపు ప్రియులు తిరుగుట చూచినారు ఆంజనేయుడు. లంకలో ప్రవేశించిన ఆంజనేయునికి రమణీయము మరియు భయానకము మరియు వికారములతో కూడిన దృశ్యములు అగుపించినను తన మనోస్థితిని ఏ మాత్రము చలింపకుండా ముందుకు నడిచినాడు మారుతి.

ఇంద్రియస్యేంద్రియ స్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ

తయోర్న వశమాగ చ్ఛేత్ తౌ హ్యస్య పరిపన్థినౌ (భగవద్గీత అ-3, శ్లో.34)

అర్థం : ఇంద్రియ విషయములందు రాగద్వేషములు దాగియున్నవి. అవి వశము కాకూడదు. ఆ రెండు శ్రేయస్సునకు శత్రువులు.

వీతరాగభయాక్రోధా మన్మయా మాముపాశ్రితాః

బహవో జ్ఞాన తపసా పూతా మద్భావ మాగతాః (భగవద్గీత)

అర్థం : సర్వదా రాగ భయక్రోధ రహితులైన వారు, దృఢమైన భక్తితో స్థిర బుద్ధి కలిగిన వారికి నా స్వరూపమును పొందియుండిరి.

పై రెండు శ్లోకములను పరిశీలింపగా మారుతి రాగద్వేషములకు వశుడుకాలేదు. తాము లంకలో ప్రవేశించిన పిదప ప్రియమైనవి, అప్రియమైనవి, భయానకమైనవి మరియు వికారమైనవి చూచినప్పటికి హనుమంతుడు రాగభయక్రోధ రహితుడై తన భక్తితోనే బుద్ధిని స్థిరపరచుకొని శ్రీరాముని ఆశ్రయించి పవిత్రుడైనాడు.

మారుతి కఠిన బ్రహ్మచారి. అటువంటి మారుతికి రామకార్యార్థమునకై లంకకు ప్రవేశించగ కొన్ని చూడరాని సంఘటనలు కూడా చూడవలసి వచ్చినది. ఆ లంకలో రాక్షసులు కామక్రీడలలో మురుయుచున్న దృశ్యములను చూడవలసి వచ్చినది. కాని మారుతి ఏమాత్రము మనస్సు వికారము చేసికొనక తన మనసునంతా రాముని రూపముతో రోమములంతా రామనామ స్మరణముతోనింపిన ఆ రామదాసుడు భక్త శిరోమణి మారుతికి ఎటువంటి సంఘటనలు లేదా దృశ్యములు చూచినను తనకు చీమ కుట్టినట్లు కూడా ఉండదు. పైగా అటువంటి కామాంధులలో సీత ఉండదని భావించి ముందుకు సాగెను. **ఆంజనేయుడి మనోస్థితి మరియు బ్రహ్మచర్య బలము శ్రీరామునికి ముందే తెలుసు. కావుననే ఈ కార్యమునకు హనుమంతునినే శ్రీరాముడు ఎన్నుకొని సీత జాడకై లంకకు పంపినాడు.** ఎటువంటి వికారములు శృంగార దృశ్యములు మారుతిని ఏమీ చేయలేవు. ఆయన మనస్సుని చెలింపను చేయలేవు. హనుమంతుడు తన మనస్సున రామనామమును విడువక ముందుకుపోవుచున్నాడు. సింహ ద్వారము ఎదురైనది. అది నవరత్న

ఖచితమైన బంగారు కాంతులతో, బంగారు తోరణములతోనున్న హేమ మందిరము. పైన జెండాలతోను కనపించుచున్నది. లోన నృత్యములతో మృదంగ నాదములతో వీణాగాన వినోదములతో ఉన్న రావణుని దివ్య భవనము కనిపించినది. ఉద్యానవనములు చిత్రశాలలు రతీగృహములతో ఉన్న రావణుని దివ్య భవనము కనిపించినది. రకరకాల రంగుల పక్షులు ఆ పక్షులు పాడే పాటలు వినిపించుచున్నవి. పన్నీట సువాసనలు గంధధూపముల వాసనలు, అత్తరసువాసనలు వచ్చుచున్నవి. ఉత్తమజాతి స్త్రీలు కూడా కన్పించుచున్నారు. ఆ దానవులను పరిపాలించే లంకారాజ్యమున నిత్యపూజలు జరుగుచున్నవి. లంకేశ్వరుని ప్రాణదేవుడైన శివుడికి అర్చనలు జరుగుచున్నవి. మారుతి అంతట సీత కోసమై చూచుచు ఎవరికంట పడక అక్కడున్న రాక్షస వీరులైన కుంభకర్ణుడు, ఇంద్రజిత్తు, సుమాలి, నికుంబుడు, ప్రహస్తుడు, విరూపాక్షుడు మొదలగు వారి గృహములనందు సీత జాడకై వెతుకుచుండెను. లంకేశ్వరుడైన రావణుడు కుబేరుని ఓడించి తీసుకువచ్చిన పుష్పక విమానమును మారుతి గాంచినాడు. ఆ పుష్పక విమానము రావణుని భవనమున మధ్యమున అటు నేలను తాకక నిల్చియున్నది. దానిని వర్ణించుట శక్యముకాదు. అటువంటి పుష్పక విమానమందు రావణ మందిరము సువర్ణమందిరముగా సుగంధపూరితమై నుండుట మారుతి గాంచినాడు. లంకేశ్వరుడు యుద్ధమునందు గెలిచి స్త్రీలెందరినో లంకకు గొనివచ్చెను. అటువంటి స్త్రీలెందరినో మారుతి గాంచెను. వారందరు కన్యలే. పైగా లంకేశ్వరుని మెచ్చి వరించినవారే. అటువంటి వారిని పుష్పకమందు రావణుని మందిరమున ఉండుట గమనించినారు. ఆ స్త్రీలలో శృంగార ప్రియులు కొందరు, సౌందర్యవతులు, ఉత్తమ జాతికి చెందిన స్త్రీలు కలరు. వారిలో కొందరు రావణాసురిడి శక్తికిమెచ్చి వరించినవారు రావణుని సంపదలకు మెచ్చి వరించినవారు కలరు. అటువంటి వారందరితో లంకేశ్వరుడు సమముగా ఏలినాడు. మారుతి మనసులో ఒక సందేహము తళుక్కుమన్నది. ఒకవేళ సీతాదేవికి వివాహము కాకపోయిన రావణుని దృష్టిలోపడి ఉండెడిదని అప్పుడు సీతాదేవిని అక్కడి రాణులందరికి మహారాణి అగుటచే రావణుని గర్వము పెరుగుటతోపాటు సీతాదేవికి సుఖములు కూడా పెరిగెడివని మారుతి భ్రమించెను. వెంటనే మారుతి తన మనస్సును నిశ్చలము చేసుకొని మహా ప్రతివతయైన సీతాదేవిని అట్లు ఊహించుకొనుట తప్పుచేసినానని తలంచి క్షమాపణ తన మనస్సులోనే వేడుకొని సీతను వెతుకుటకు ముందుకు సాగెను. మారుతి తన మనస్సులో వచ్చిన ఆ సంశయము సీతాదేవిపై అపనమ్మకము చేతకాదు. రావణాసురుని దుర్బుద్ధికి హద్దులు లేకపోవుటచే లోకములో ఎందరినో జయించిన ఆ లంకేశ్వరుడు ఎందరినో కన్యలను లంకకు తెచ్చి పరిణయమాడినాడు. అటువంటి రావణాసురుడి దృష్టిలో ఒకవేళ సీతాదేవికి వివాహము కాకున్న యెడల తప్పక రావణుడు సీతను లంకకు గొనితెచ్చి పట్టపురాణిగా చేసి ఉండెడి వాడని మారుతికి లోన ఉన్న భావము ఇది మాత్రమే. పైకి ఆ విధముగా అనినను మారుతి మనస్సులో సీతామాతపై ఎటువంటి సంశయము లేదు. కాని రావణుడి దుర్బుద్ధిపై సంకోచము ఉండుటచే అట్లు అనుకొనినాడు.

రాం రామాయనమః

# అధ్యాయము - 11

శ్రీ రామ రామ రామ

రాజారామ్

ఓం నమో నారాయణాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం విష్ణవే నమః । ఫట్ ఇత్యస్త్రాయ షట్

భూర్భువస్సువరోం ఇతి దిగ్బంధః (నారాయణ వచనమ్)

అర్థం : నారాయణుడికి నన్ను నేను సమర్పించుకొని నాయందు ఉన్న వాసుదేవుడికి నా నమోవాకములు. విష్ణువుగా నా సర్వస్వమునందు నిండెనుగాక. ఈ అస్త్రము ధరించి నేను దిక్కులను బంధించుచు సర్వలోకములను అధిగమించి ఆ నారాయణుని తేజస్సునందు లీనమగుదునుగాక.

మారుతి పుష్పక విమానమందు రావణుని మందిరము గాంచెనని చెప్పుకొంటిమి. ఆ మందిరమునందు లంకాధీశుడి దివ్యశయనము మారుతి గాంచెను. అది రత్నమణులతో దంతపు పన్నులతో సుగంధములతో ఎంతో విశాలముగా మృదువుగా ప్రకాశించుచున్నది. దానిపై లంకేశ్వరుడు సతులతో గూడి మధుపానము సేవించి రతికేళి సలిపి శయనించిన రావణుని మారుతి గాంచెను. రాక్షసరాజ రావణుడు కూడా సుందరాంగుడై శక్తివంతుడు, మహాబలుడు, నల్లని కోడె త్రాచువలె శయనించినవాడు. అతని ఒంటిపై ఆభరణములు మరియు స్వర్ణకిరీటము జరిగి సొమ్మసిల్లి పడియున్న రావణుని మరియు అతని కాంతలను మారుతిగాంచెను. దశకంఠుడు ఎంతో గంభీరుడని మరియు భుజబల తేజోవంతుడని మారుతి గమనించెను. అక్కడ అందరు సొమ్మసిల్లి పడి ఉండుట మారుతి గాంచినాడు. సీత జాడకై వెతుకుతునే ఉన్నాడు. ఒకచోట దివ్య మనోహరమైన స్వర్ణదేహముతో భూషణములు ధరించి ఉన్న మహారాణి లంకేశ్వరుని సతి అయిన మండోదరి నిదురించుచున్న దృశ్యమును మారుతి గాంచినాడు. మండోదరి ఎంతో ఉత్తమురాలు. సత్వగుణము కల్గిన సాధ్వి. తన భర్తయైన రావణునికి ఎన్నో పర్యాయములు సీతాదేవికి రామునికి అప్పగించి తన తప్పును సరిదిద్దుకొనమని శ్రీరామునికి క్షమాపణ వేడమని లేకున్నచో లంకకే ముప్పని బోధించినది. రావణుడు తన భార్య బోధనలను లక్ష్యపెట్టక మండోదరిపై కోపగించుకొనేవాడు అటువంటి సరళ స్వభావము, మంచి మనసు, వినయము, నమ్రత, బుద్ధిశాలి అయిన మండోదరిని ఎవరైనా చూచినా రాక్షసుని భార్య అని ఎవ్వరూ అనుకోరు. మారుతి కూడా లంకేశ్వరుని భార్య అయిన మండోదరి శయనించు దృశ్యమును చూచి సీత అని అనుకొనెను. మండోదరిని చూచి జానకి అని భ్రమించిన మారుతి ఆనందమును తట్టుకొనలేక గంతులువేసి పాటపాడి ఆడి తన తోకనే తాను పట్టుకొని ముద్దాడి నేలపై కొట్టి తన భుజములను తానే తట్టుకొని క్రిందికి పైకి దూకుట చెట్లపైనెక్కి స్తంభములపైదూకి భీభత్సము చేసెను మారుతి. ఎందరినో కామరూపిణులను చూచినను మారుతి కామికునిగాక తన మనస్సును నిబ్బరము చేసుకొని నిశ్చలముగా ఎటువంటి దృశ్యమును చూచినను

చెలింపక సీత జాడకై వెదకుచున్న మారుతి మండోదరి సౌమ్యరూపమును, ప్రశాంత ముఖమును చూచిన పిదప సీతామాత అనుకొని గంతులు పెట్టినాడు. తన మనస్సులో తల్లి సీతాదేవి రూపానికి మాత్రమే చోటిచ్చినాడు. ఇతర స్త్రీలు ఎంత వికారములుగా కన్పించినను కొందరు నగ్నముగా పడుకొని ఉన్నను అటువంటి వికార దృశ్యములకు లోనుకాక తల్లి సీతామాత రూపమునకు మాత్రమే ప్రాధాన్యతనిచ్చి మండోదరి సౌమ్యరూపమునుగాంచి తన మనసులోనున్న సీతామాత రూపము ఒకటేనని భ్రాంతి చెంది సంతసించినాడు. కాని బంగారు నగరమును చూచి స్వర్ణమందిరమును చూచి నవరత్న ఖచిత పుష్పక విమానమును చూచి అందున్న స్ఫటిక మణులతోనున్న రావణుని శయన మందిరము చూచి ఎందరెందరో కన్యలను చూచినను ఆడంబరమైన భూషణములు ధరించి పరుండిన స్త్రీలను చూచినను మధువు త్రాగి మత్తులోనున్న కాంతలను చూచినను రతికేళి జరుపుచున్నవారిని చూచినను ఆంజనేయుడు చెలించలేదు. ఆ దృశ్యములకు సంతోషముతో ముగ్దుడుకాలేదు. కాని మండోదరిని చూచిన పిదప సీతాదేవియేయని సంతసించి కుప్పిగంతులు వేసినాడు మారుతి.

మారుతి మండోదరిని చూసి తండ్రి రఘురాముని సతియైన సీతామాత కాదని తలంచెను. ఎందుకంటే శ్రీరాముని సీత లంకేశ్వరుని చేరి శయనించుట అసంభవమని రాముని వదిలి ఎడబాటుతోనున్న ఆ జానకీ మాతకు నిదుర ఎట్లు వచ్చునని పైగా శ్రీహరిని వదిలిన జానకి నిదురించునా ? ఒంటిపై బంగారు ఆభరణములతో రత్నముల హారములను ధరించునా ? పంచభక్ష్య పరమాన్నము మరియు ఫలములు భుజించునా ? పరమపురుషుడైన ఆ పరమాత్మయైన రాముని మరచి పరపురుషుడైన రావణునితో ఉండునా ? అని తలంచి తాను చూచిన మండోదరి సీతకాదని మారుతి ముందుకు సాగెను.

సర్వస్య చాహంహృది సన్నివిష్ణో

మత్తః స్మృతిర్ జ్ఞానమపోహనంచ

వైదశ్చ సర్వేరహమేవ వేద్యో

వేదాంత కృద్వేద విదేహ చాహమ్ (భగవద్గీత)

అర్థం : సర్వజీవులలో అంతర్యామిగా ఉన్నవాడను నేనే. నా నుండియే స్మృతి, జ్ఞానము, అపోహనము (సందేహము తొలగించుట) కలుగుచున్నది. వేదకర్తను, వేదజ్ఞుడను కూడా నేనే.

మారుతి మొదట మండోదరిని చూచి తల్లి జానకి అనుకొనెను. కాని మండోదరి ఆభరణములను ధరించి కంటి నిండా నిద్రతో శయనించుట చూచి తన తల్లి సీతకాదని తలంచెను. అట్టి జ్ఞానముపై భగవద్గీత శ్లోకములో చెప్పినట్లుగా ఆంజనేయుని హృదయములో అంతర్యామిగా ఉన్న తన తండ్రియైన శ్రీరాముడు హనుమంతునికి వచ్చిన తలంపును అపోహనము చేసి అనగా సందేహమును తొలగించి అంతర్యామిగానున్న శ్రీరాముడు రామబంటును అడుగడుగున రక్షిస్తూనే ఉన్నాడని ఋజువైనది.

మారుతికి వచ్చిన ఆ తలంపుకు చింతించి హనుమాన్ తన మనస్సులో ఇట్లనుకొనెను, "సీతజాడకై పోవగరాని స్థలములలో బ్రహ్మచారినైనను నేను పోవలసివచ్చి చూడరానివి ఎన్నెన్నో చూచుటవలన పాపినై ఇట్లు భావించితిని" అని అనుకొని తన రామునికి క్షమాపణ కోరుకొనెను. వెంటనే మనసులో ఎటువంటి వికారమును పొందక నిష్కాకముగ సీతజాడ కొరకు అట్టి చూడగరాని ప్రదేశములలో వెతికితిని కాని మనస్సున ఏ పాపమెరుగనని స్వామి సేవయే పరమార్ధమని రామకార్యమును నెరవేర్చవలెనని కాంక్షతో అట్లు చూచితినని మారుతి తలంచెను. మారుతి సీత జాడకై లంకాపురములోని అన్ని వీధులు, గృహములు చూచెను. ఎచ్చటను సీత కనపబడలేదు. మారుతికి మరియొక అనుమానము కూడా కల్గెను. లంకలోని అతి భయంకర రాక్షసుల వీరులను చూచి అసలు సీతామాత ప్రాణములతో ఉన్నదో లేదోనని అటువంటి భయంకర రాక్షసుల చేతిలో హతమారెనోనని అంతట వెదుకుచూ అడుగడుగున ఆగి ఆగి సీతకొరకై వెతుకుచుండెను లేదా రావణునికి లొంగక శ్రీరాముని వియోగము భరించలేక సీతామాత తానే మరణ శిక్ష విధించుకొన్నదేమోనని హనుమంతుడు పరిపరి విధముల యోచించుచూ ముందుకుసాగెను.

రాం రామాయనమః

# అధ్యాయము -12

శ్రీ రామ రామ రామ

రాజారామ్

మాముగ్ర ధర్మా దఖిలా త్ప్రమాదా

న్నారాయణః పాతు నరశ్చహాసాత్

దత్తస్త్వయోగా దథయోగనాథః

పాయా ద్గణేశః కపిలః కర్మబంధనాత్ (నారాయణకవచము)

అర్ధం : విషమ పరిస్థితులలో పొరపాటు లేకుండా శ్రీమన్నారాయణుడు నన్ను రక్షించుగాక. గర్వముతో చేయు పరిహాసము నుండి నరుడు నన్ను రక్షించుగాక. నా అయోగ వైఖరి నుండి దత్తాత్రేయుడు రక్షించుగాక. వినాయకుడు విఘ్నములను కల్పించుకొనకుండా రక్షించుగాక. కర్మ సంగమునుండి కపిలాచార్యుడు నన్ను రక్షించుగాక.

ఆంజనేయుడు ఎంతవెతికినను సీతజాడ తెలియలేదు. మారుతి తన మనసులో ఇట్లనుకొనెను, "ఒకవేళ సీత జాడ తెలియని పక్షమున నేను ఆ వార్తను రామలక్ష్మణులకు తెలిపినచో ఎన్నో అనర్ధాలకు దారి తీయునని తెలుపకున్నచో స్వామి ద్రోహము చేసిన వాడగుదునని, ఒకవేళ రామునికి ఆ దుర్వార్తను చెప్పిన యెడల సీతలేని రాముడు ఉండునా ? అన్న లేక సోదరుడైన లక్ష్మణ కుమారుడు ఉండునా ?" అని

మారుతి వివిధ భావనతో కలత చెందినాడు. అట్లే రామలక్ష్మణులు లేకున్నచో భరతశతృఘ్నులు మరియు తల్లులైన కౌసల్య, సుమిత్ర మరియు కైకేయిలు ఉండగలరా ? రామునికి ప్రియమైన వానర సేనలు మరియు వానరరాజు సుగ్రీవుడు ఉండునా ? అని మారుతి విరుద్ధ భావనలతో కలతచెందెను. పైగా మారుతి ఇట్లనుకొనెనను, "ఇంత అనర్ధమునకు కారణము నేనే. సీత జాడ కనుగొన లేకపోతిని. ఆ దుర్వార్త చెప్పుటచే ఇన్నింటికి దుఃఖపరిణామాలు వచ్చునని ఇంతటి బాధను భరించుట కంటే కిష్కింధకు పోవుట తగదని సీతమాత జాడ కనుగొని తీరెదనని లేనిచో నా ప్రాణములను అగ్నికి ఆహుతి చేసుకొనెదను" అనుకొనెను. తిరిగి హనుమంతుడు సీత జాడకై వెతకసాగెను.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్

ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే (భగవద్గీత)

అర్ధం : సత్పురుషులను పరీక్షించుట దుష్టులను రూపుమాపుటకు, ధర్మమును నిలబెట్టుటకు నేను ప్రతీ యుగమున అవతరించెదను.

పై మాటలు నారాయణుడు అన్న మాటలు. భూదేవి దానవుల విపరీత చర్యలను మరియు దానవ రాజైన లంకేశ్వరుని హింసాకాండను రక్షించుటకై నారాయణుని వేడుకొనగా నారాయణుడు అధర్మముగా పరిపాలించే రావణుని హతమార్చుటకై ధర్మమును నిలబెట్టుటకు శ్రీరాముని రూపము దాల్చెను. అట్టి రాముడు దుష్టులైన రాక్షస రాజైన రావణుని మరియు అతని పరివారమును శిక్షించుటకు రూపుదాల్చెను. అంతటి శక్తి సంపన్నుడైన శ్రీహరి శ్రీరాముని అవతారమున తనదాసుడైన భక్తుడు ఆంజనేయుని ఎన్నుకొని సీతజాడకై లంకాపురమునకు పంపుటకు సమ్మతించి ఆ శ్రీహరి ఏమీ ఎరుగని నటుడి వలె మామూలు మానవుని వలె ప్రవర్తించెను. ఆంజనేయుడు రామకార్యార్ధమునకై ఎంతో శ్రమతోకూడిన కార్యభారమును స్వీకరించి అనేక అడ్డంకులు ఎదురైనను వాటిని పోరాడి లంకాపురమునకు చేరి సీతజాడకై వెతికి వెతికి చివరకు సీతజాడ తెలియలేదన్న దుర్వార్తను తన తండ్రియైన శ్రీరామునికి తెలుపుటకంటే తానే అగ్నికి ఆహుతి అయిపోవుట మేలనుకొనెను. శ్రీరాముడు తన బంటు అయిన మారుతిని ఎన్నో రకములుగా పరీక్షించెను. గీతా శ్లోకము ప్రకారము సత్పురుషులను పరీక్షించుటకై దుష్టులను శిక్షించుటకై ధర్మమును నిలబెట్టుటకై ప్రతీ యుగమున అవతరించెదనని శ్రీహరి అన్నారు. శ్రీహరి పరీక్షకు చివరిదాకా ఎదుర్కొన్న మారుతి సీతజాడ తెలియలేదన్న వార్తకంటే తానే మరణించుట మేలనుకొన్న హనుమాన్ శ్రీహరి పెట్టిన పరీక్షలో సత్పురుషుడైన హనుమాన్ ఉత్తీర్ణుడైనాడని రామకార్యము సఫలమే ముఖ్యముగాని తన ప్రాణములు ముఖ్యము కాదనుకున్న సత్పురుషుడైన హనుమంతుని మనోస్థితికి జోహార్లు.

ఆంజనేయునికి అటువంటి సందేహములు వచ్చిన పిదప అగోచరమైన పరిస్థితులలోనున్న శ్రీరాముడు (అంతర్యామిగా) ఒక మెరుపులాంటి ఆలోచన మారుతికి కలిగించెను. అన్ని వీధులు, వాడలు, వనములు సీత జాడకై వెతికిన రామబంటు అశోక వనమును మరిచెను. అట్టి సమయములో అశోకవనమును గుర్తుకు తెచ్చినది మారుతిలోనున్న ఆ ఆత్మారాముడే.

సర్వస్య చాహం హృది సన్ని విష్టో ............ (భగవద్గీత)

సర్వజీవులలో అంతర్యామిగా ఉన్నవాడను నేనే. నా నుండియే స్మృతి, జ్ఞానము, అపోహనము (సందేహము తొలగించుట) కలుగుచున్నది. వేదకర్తను, వేదజ్ఞుడను కూడా నేనే.

పై భగవద్గీతలోని శ్లోకార్ధ ప్రకారము **హనమంతునిలో అంతర్యామిగా వున్న ఆ పరమేశ్వరుడు శ్రీరాముడే. అట్టి అంతర్యామియగు శ్రీరాముని వలెనే తలంపు పుట్టి సీతామాత అశోకవనములో ఉండునేమోనని జ్ఞానమును ఆ ఆత్మారాముడు హనుమంతునికి కల్గించెను.** మరియు మారుతిలో అంతర్యామిగా నున్న ఆ ఆత్మారాముడే మారుతి సీతజాడ తెలియని పరిస్థితులలో అట్టి జాడ తెలియని దుర్వార్తను రఘురామునికి తెలుపుటకంటే తానే అగ్నికి ఆహుతి అయిపోవుటకు నిశ్చయించుకొనిన సమయమున అట్టి సందేహమును అంతర్యామిగానున్న ఆ ఆత్మారాముడు మారుతికి అశోక వనము వెతుకుటకు లోనుండే సంకల్పము కల్గించి ఆ రఘురాముని భక్త శిరోమణియైన ఆంజనేయుని రక్షించెను.

తిత్తిలోని శివుని స్థిరంగా తెలియక

తిక్కబట్టి జనుడు తిరుగుచుండు

తిక్క తీర్చ గురుడి కొక్కడే దిక్కురా

విశ్వదాభిరామ వినురవేమ (వేమన శతకము)

మానవుడు తన దేహములోని పరబ్రహ్మను తెలుసుకొనలేక దేవుడు దేవుడంటూ తిక్కబట్టి తిరుగుచుండును. ఆ తిక్కను సరిదిద్దేశక్తి ఒక్క గురువుకు మాత్రమే ఉందంటారు.

పై పద్యమున వేమన ప్రతీ జీవిలోను పరబ్రహ్మ ఉంటాడని ఆ పరబ్రహ్మే ఎప్పుడూ ఎటువంటి అవసరము లేదా సంశయము కలిగినపుడు ఆ జీవిలోని పరమాత్మ ఆలోచన చేయుచున్న జీవికి ఒక తళుకు వంటి సమాధానం నిజానికి దేహములోని ఆత్మ పరమాత్మయే కావున ఆ పరబ్రహ్మయే అటువంటి సమాధానాన్ని ఇవ్వడం జరుగుతుంది. కాని ఆ జీవి తెలుసుకొనలేక దేవుడు దేవుడు అంటూ తిరుగుచూ తన సమస్య తీర్చమని అనుకుంటాడు. ఇంకొద్దిగా అహంకారి అయినవాడు ఏదైనా సమస్య వచ్చినపుడు పైన చెప్పిన విధముగా దేహములోని పరబ్రహ్మ ఒక మెరుపులా సమాధానం ఇచ్చినప్పటికి ఆ అహంకారి అయిన జీవి ఆ ఆలోచన లేదా సంకల్పము అతని వలనే కల్గెనని భ్రమించెదట. అటువంటి జీవులూ కలరు. జీవిలోని పరబ్రహ్మం తెలుసుకొనలేక దేవుని కోసం తిక్కబట్టి తిరుగు చుండెడి వారెందరో కలరు. **అటువంటి తిక్కను సరిదిద్దుటకు ఒక శక్తి గురురూపేణా పరమాత్మయే బైటకు వచ్చి అటువంటి తిక్కను కుదిర్చి తిరిగి మాయమయ్యెదరు.**

ఆంజనేయుడు సత్పురుషుడు మామూలు మనలాంటి సామాన్యమైన జీవికాదు. ఆయన వేసే ప్రతీ అడుగూ తన ఆత్మారాముడినే తలచి సీత జాడ వెతుకుటకు మరియు రామకార్యము నెరవేర్చుటకెంతో

పెద్ద భారాన్ని వహించి ఎన్నో కష్టాలు పడి లంకకు చేరి సీతజాడ కొరకు లంకాపురమంతా వెతికినను సీత జాడ తెలియకపోవుట వలన ఆ దుర్వార్త మోసుకుని పోవుటకంటే తన దేహమునే త్యజించుట మేలనుకొనెను. అటువంటి సత్పురుషుని దేహములోనున్న ఆత్మారాముడు వెంటనే అశోకవనమున వెతుకుటకు దారిచూపెను. ఆంజనేయుడు ఆ సంకల్పము తనదికాదని **తన దైవమైన శ్రీరాముడే గురు రూపేణా బోధించినాడని గ్రహించి వెంటనే సీత జాడకై అశోకవనమున ప్రవేశించెను.**

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతితిసిద్ధయే

యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తితత్త్వతః (భగవద్గీత, 7వ అధ్యాయం, 11311 శ్లో.)

అర్థం : వేలకొలది జనులలో ఒక్కడు మాత్రమే నన్ను గురించి తెలుసుకుందురు. అట్టివాడు ఆత్మను సిద్ధించుకుంటారు. (యధార్ధ స్వరూపము తెలుసుకొనుటకు) మారుతి అట్టి యధార్ధ స్వరూపుడైన ఆత్మారాముని తెలుసుకున్న ధన్యజీవి.

రాం రామాయనమః

# అధ్యాయము - 13

శ్రీ రామ రామ రామ

రాజారామ్

అంతా రామమయం

జగమంతా రామమయం

అంతరంగమున ఆత్మారాముడు

అనంతరూపముల వింతలు సలుపగ (రామదాసు కీర్తన)

వాయునందనుడు సీత జాడకై అశోక వనమున ప్రవేశించెను. ఆ వనము ఎంతో అందముగా, ఆహ్లాదకరముగ, చల్లని గాలితో రకరకాల పువ్వుల చెట్లతో, నోరూరించే పలురకాల ఫలరసాల చెట్లతో తుమ్మెదలు, కోయిలలు, చిలుకలు, నెమళ్ళు, రంగుల పక్షులు ఆ వనమున అటుఇటు కనబడెను. **రామభక్తుడు ఆంజనేయునికి ఆ అశోకవనము అంతా రామమయంగా కన్పించినదేమో!** తన అంతరంగముననున్న ఆ ఆత్మారాముడే అనంత రూపాలుగా వింతలు చూపుతూ కనిపించెనేమోనని సంబరముతో వాయునందనుడు ఒక చెట్టు కొమ్మపై నుండి మరియొక చెట్టుకొమ్మపై దుముకుతూ ఆ సుందరమైన అశోకవనమున సీతజాడకై మారుతి వెతుకుచుండెను. తన తల్లి సీతామాతకు పువ్వులనిన, ఫలములనిన ఎంతో ఇష్టమని కావున అన్ని విధములుగ అనువైన ఆ సుందర అశోకవనమున పువ్వులు, ఫలములు ఉండుట వలన సీతామాత ఆ

వనములో ఉండి తీరునని మారుతి ఆశతో వెతుకుచుండెను. జానకీమాతకు పక్షులు, మృగములు అంటే కూడా ఇష్టమని అవి కూడా ఆ అశోకవనమున తిరుగుచుండుట చూసిన మారుతి సీతాదేవి తప్పక ఆ వనములోనే ఉండుననే విశ్వాసముతో రామనామ స్మరణముతో వెతుకుచుండెను. మారుతి ఉన్న ఆ చెట్టుకొమ్మ క్రింద మాసిన వస్త్రములు ధరించి దుఃఖముతో కృంగికూర్చుని ఉన్న మాతను మారుతి చూచెను. ఆ చెట్టుకొమ్మకు తన ఒంటిపైనున్న సువర్ణ ఆభరణములను తగిల్చి ఒంటిపై ఏ ఆభరణములు ధరించక దుఃఖితురాలై వున్న ఆ మాతను మారుతి గాంచెను. రావణాసురుడు సీతను అపహరించుకొనిపోవు సమయమున ఆ గగన మార్గమున సీతామాత తన ఒంటిపైనున్న సొమ్ములను ఒక వస్త్రమున కట్టి ఋష్యమూకమున పై నుండి క్రిందికి ఒదిలెను. ఆ వదిలిన ఆభరణములు శ్రీరామచంద్రుడు మారుతికి తాను సీతజాడకై లంకాపురమునకు బయలుదేరుటకు ముందు ఆ ఆభరణముల గుర్తులు శ్రీరాముడు మారుతికి చూపించుట వలన అశోకవనమున చెట్టుకొమ్మపై నున్న హనుమంతుడు అదేచెట్టు కొమ్మచివర తగిలించియున్న ఆభరణములను గాంచిన మారుతి ఆ ఆభరణములు తన తల్లి సీతామాతవేనని గుర్తించి ఆ చెట్టు క్రింద దుఃఖితురాలైయున్న ఆ మాత సీతామాతవేయేనని గ్రహించి ఎంతో ఆనందముతో ఉప్పొంగిపోయెను. సాక్షాత్తు భూమాత పుత్రిక, జనక మహారాజు ముద్దుల పుత్రిక, శ్రీరామచంద్రుని అర్ధాంగి ఎంతో అందమైన లక్ష్మీదేవి ఆ రూపముననున్న జగన్మాతకు వచ్చిన కష్టమును చూచిన మారుతి ఎంతో దుఃఖించెను. నిద్ర, ఆహారము మరచి మాసిన బట్టలను ధరించి నిట్టూర్పుతోనున్న ఆ తల్లిని చూచిన వాయునందనుడికి దుఃఖము కల్గెను. ఇంతవరకు సీతజాడ కనలేదనే బాధ ఒక ఎత్తైతే ఆ జగన్మాత జాడను తెలుసుకొనిన పిదప అట్టి దీనురాలి అవస్థను కటిక నేలపై కూర్చుని ఏ ఆభరణములు లేక జుట్టు ముడి లేక అనుక్షణము రామునినే తలుస్తున్నట్లు ఆ మాత ముఖము చూచినంతనే మారుతికి సీతాదేవి పరిస్థితి అర్ధమయ్యెను. అట్లు **సీత జాడ తెలిసిన పిదప మారుతి పొందిన సంతోషమంతయు ఆ తల్లిపడుతున్న అవస్థ చూచిన పిదప మారుతి చెందిన ఆనందము మటుమాయమయ్యెను.**

తెల తెల్లవారు చుండగా చెట్టుపైనున్న మారుతికి మంగళ వాద్యములు విన్పించెను. చెట్టుక్రింద నేలపై ఎన్నడో నిద్రాహారములు మానివేసియున్న సీతామాత దీనురాలై కూర్చుని యుండెను. ఆ మంగళ వాద్యములు రావణాసురుని మేలుకొల్పేందుకు చేసే ధ్వనులవి. లంకేశ్వరుడు వేకువఝామునే లేచి మదిలో అశోక వనముననున్న సీతను చూడదలచి తన కార్యములన్ని నెరవేర్చుకొని దశకంఠుడు పలువురు స్త్రీలతోను అశోకవనము వైపున పయనము సాగించెను. ఆ లంకేశ్వరునికి ఛత్ర, చామరలు పట్టిరి కొందరు మరికొందరు మధువునున్న సువర్ణ పాత్రలతో ముందు నడువగా లంకేశ్వరుడు దివ్య తేజముతో నడుచుచుండెను. కొందరు రావణుని భుజముపై వ్రేలాడుచున్న ఉత్తరీయమును పట్టుకుని నడుచుచుండెను. ఆ రాక్షసరాజు అశోకవనమునకు రానే వచ్చెను. సీత కూర్చుని ఉన్న చెట్టు వద్దకు వచ్చి సీతపైననే చూపులు నిలిపెను. ఆ చెట్టు కొమ్మపై దాగియున్న పవనకుమారుడు రావణుని తేజమును చూడదల్చి పై కొమ్మనుండి క్రింది కొమ్మకు దుమికెను. మహాబలశాలి అయిన రావణుని సీత చూచి మనసులో రామనామ స్మరణము చేసుకుంటూ కూర్చునియుండెను.

ఆఢ్యోభిజనవానస్మి కోన్యోస్తి సదృసోమయు

యక్ష్యేదాస్యామి మోదిష్య ఇత్యజ్ఞాన విమోహితాః

అనేక చిత్తవిభ్రాంతాః మోహజాల స మావృతాః

ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకే శు చౌ(భగవద్గీత, అ-16, శ్లో.15,16)

అర్థం : నేను గొప్ప ధనవంతుడను, మిక్కిల పరివారము కలవాడను, నాతో సమానులు మరియొకరు లేరు. నేను యజ్ఞములను చేయగలను, దానములివ్వగలను, యధేచ్ఛముగా వినోదింపగలను అనే అజ్ఞాన మోహితులైన వారు చిత్త భ్రమణమునకులోనై మోహజాలమునందు చిక్కుకుని అసురలక్షణములు గల వారు విషయ భోగాలయందే ఆసక్తులై నరకమున పడిపోవుదురు.

రావణుడు సీత కడకు వచ్చి ఇట్లనెను, "ఓ సుందరీ! రాముడు నీకు తగినవాడు కాదు. నేను గొప్ప ధనవంతుడిని. నా కడ సువర్ణ భాండములు, నవరత్న హారములు, లెక్కలేనంత ధనము, మణిమయరత్న సువర్ణ భూషణములు, దివ్యాంబరములు, పట్టు వస్త్రములు, ఎత్తైన విశాలమైన సువర్ణ భవనము కలవు. నాకడ మిక్కిలి పరివారముతోపాటు అనేకమైన అశ్వములు, ఏనుగులు మరెన్నో బలగములు కలవు. నాతో సమానమైన వారు ఈ జగత్తులో ఎవ్వరూ లేరు. నా లంకారాజ్యమున యజ్ఞములు కావింపబడుచున్నవి. దానము కూడా ఇవ్వబడుచున్నది. రాముడు నిన్ను సుఖపెట్టలేడు. ఆ రాముని మరచి నన్ను ఏలుకొనుము. రాముడు వచ్చి నాతో యుద్ధము చేసి నన్ను గెల్చుట అనునది కల్ల అని కుబేరులు, ఇంద్రాది దేవతలతో గెల్చిన వాడిని నేను. అటువంటి నాకు నరుడైన రాముడంటే భయమేల ?

పై చెప్పిన గీతా శ్లోకము ప్రకారము లంకేశ్వరుడు సాక్షాత్తు లక్ష్మీదేవి సీతామాత అవతారమున భువిపై వచ్చెనని లంకేశ్వరునికి తెలియదు. అటువంటి **లక్షణమైన లక్ష్మీ సంపన్నురాలైన ఆ లక్ష్మీదేవి ముందే రావణుడు తన సంపదలను గురించి గొప్పతనము గురించి చెప్పుకొనుట అజ్ఞానమే.** అతని చిత్తము భ్రమణమునకులోనై మోహజాలమున చిక్కుకొనిననది. అంతేకాక రావణుడు, సాక్షాత్తు నారాయణుడే శ్రీరాముడు అవతారము దాల్చి అవనిపై అవతరించెనని తెలియక రాముని అతని బలమును ఒక సామాన్య మానవునిగా తలంచి రావణుడు నిందించెను. **సకల సృష్టికర్త నారాయణుడి బలమెక్కడ ? రావణుని బలమెక్కడ ?** ఈ విషయములో కూడా రావణుడు అజ్ఞానమోహితుడై చిత్త భ్రమణమునకులోనై మోహజాలమునందు చిక్కుకొనెను. అటువంటి అసుర లక్షణములు గల ఆ రావణుడు ఘోరనరకమునకు పడిపోవుటతథ్యము.

అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః

మామాత్మ పరదేహేషు ప్రద్విషంతో భ్యసూయకాః (భగవద్గీత, అ.16, శ్లో.18)

అర్థం : అహంకారము, బలము, దర్పము, కామము, క్రోధములకు వశులై ఇతరులను నిందించుచు తమ

శరీరముల యందును ఇతర శరీరమందును అంతర్యామిగానున్న నన్ను ద్వేషించు చుందురు.

రావణుడు ఆ విధముగా అహంకారముతో తనకున్న బలము దర్పముతో రామునిపై నున్న క్రోధముతో సీతముందు ప్రవర్తించెను. అహంకార బల దర్పము మరియు క్రోధము వలన కామము కలుగును. కావున రావణుడు సీత ముందు అట్లు ప్రవర్తించి శ్రీరాముని నిందించెను. కాని రావణుడు శివభక్తుడు. నిత్యం శివపూజ జరిపేవాడు. **అటువంటి వాని శరీరమందున్న ఆ పరమశివుడు అంతర్యామిగా ఉన్నాడనే విషయము ఎరుగక శ్రీరాముని నిందించెను. కావున రావణుడు తన శరీరమందును మరియు ఇతర శరీరములందును అంతర్యామిగానున్న ఆ పరమాత్మనే ద్వేషించిన వాడయ్యెను.**

లంకేశ్వరుడు అహంకార బలదర్ప క్రోధము వశుడై కామము పుట్టి సీతాదేవితో ఇట్లు పల్కెను. "ఓ సుందరీ! మాసిన బట్టలు, జుట్టు ముడివేయక ఒక మునిలా ఏల ఉంటివి. నీ రాముడిక్కడికి రాడు. నా అర్ధాంగిగా ఉండుము పరకాంతలను హరించి రమించుట మా రాక్షస వీరుల ధర్మము. ఉపవాస ముండుట, దీనముగా కూర్చొనుట ఏల నిన్ను నీవు శిక్షించుకొనుచున్నావు. నీ అందము విడిచి నా ఆనందమును ఏల దూరము చేయుచున్నావు. ముల్లోకములు వెతికినను నీవంటి దివ్య సుందరరూపము గల స్త్రీ దొరుకుట కష్టం. నీ వయస్సును ఏల వృథా చేయుచున్నావు. మరచిపొమ్ము ఆ రాముడిని. వరించుము ఈ వీరుడిని. నీవు తప్ప నాకు ఎటుచూచినా ఏదీ కన్పించుట లేదు. అంతా నీ అందమే కన్పించుచున్నది." అని రావణుడు కామాంధుడై సీతను తన మాటలతో వేధించెను.

యమా ధర్మమధర్మం చకార్యం చాకార్యమేవచ

అయథావత్ ప్రజానాతి బుద్ధిః సా పార్థ రాజసీ (భగవద్గీత, అ-18, శ్లో.31)

అర్థం : ధర్మ, అధర్మముల యొక్కయు, కార్యాకార్యముల యొక్కయు యధార్థ తత్వములను తెలియజాలని బుద్ధిని రాజస బుద్ధి అని అందురు.

రావణాసురుడు ఏది ధర్మమో ఏది అధర్మమో తెలియని వాడై అహంకారముతో సీతముందు ప్రగల్బములు పల్కినాడు. ధర్మాధర్మముల యొక్క యధార్థ తత్వములను తెలియని వాడగుటచే సీతాదేవిని రామలక్ష్మణులు లేని సమయమున అపహరించి తన రాజసబుద్ధిని ప్రదర్శించుకొనినాడు.

రావణుడు అట్లు అహంకారముతో రాముని నిందించుచు సీతాదేవిని బాధించే మాటలతో ప్రవర్తించుచుండగా చెట్టుపైనున్న మారుతి నిశ్చలముగా చూస్తూ క్రోధమునకు లోనుకాక తన మనోస్థితిని నిశ్చలత్వమును, స్థిత ప్రజ్ఞతను తిరిగి ఋజువుచేసుకొనినాడు. సీతాదేవి రావణుని మాటలు విని ప్రక్కనున్న తృణమును తృంచి రావణునితో ఇట్లనెను, "ఈ తృణముకన్న నీవు హీనుడవని నన్ను వరించుట మహాపాపమని నీకెందరో కాంతలు ఉన్నారని వారితో సుఖించి నన్ను రాముని కడకు తీసుకువెళ్ళమని నీకు సత్యమును బోధచేసేవారే లేరా ? నీలాంటి దుష్టగుణాలు ఉన్నవాడు రాజగుట ఈ లంకాపురమునకే చేటని శ్రీరామునితో వైరము నీకు నాశమునకు దారితీయును. కావున నా స్వామియైన శ్రీరాముని శరణువేడి నన్ను శ్రీరామునికి

అప్పగించుము. నీవు నిజమైన పౌరుషముగల రాజువైతే రామలక్ష్మణులు లేనిసయమున నన్ను అపహరించితివేల ? ఎందరో మహావీరులను గెలిచినవాడివి అటువంటి వీరునికి ఈ వంచనలేల ? నా స్వామిని శరణుపొందిన యెడల నేనే నా రాముని నిన్ను మన్నించి వదిలి వేయమని చెప్పెదను" అని సీతాదేవి రావణునితో పల్కెను. **రాక్షస రాజైన రావణుడికి హితబోధలు ఎలా రుచించును.** సీతాదేవి పల్కిన మాటలకు కోపముతో ఇట్లు జవాబు చెప్పెను. "మహాబలశాలిని, వీరుడిని, ధైర్యవంతుడిని, ధనవంతుడిని ఐన నాతో నీవు ఇట్లు పల్కుట నీకేమి ధైర్యము. ఎవరితో ఈ విధముగా పల్కుచుంటివో జ్ఞప్తికి తెచ్చుకొనుము. కేవలము నీ మీదనున్న మోహము వలన నిన్ను వదిలి వైచితిని. లేనిచో నిన్ను ఇక్కడికిక్కడే వధించివేయుదును. నేను నీకిచ్చిన ఏడాది గడువు ఒక్క రెండు నెలలలో తీరిపోవును. ఆ రెండు నెలలు గడిచేవరకూ నిన్ను ముట్టను. ఒకవేళ అప్పటికి నన్ను కాదని జవాబు చెప్పినచో కఠినముగా శిక్షించెదను. కావున నను వరించి సుఖించెదవో లేదా మరణాన్ని కోరుకునెదవో నీపై ఆధారపడి ఉన్నది" రావణుని కఠిన మాటలు విన్నవారందరు నివ్వెరపోయెను.

**రావణుడు రాక్షసుడైనను అతని మనస్సు సుందరమే.** ఏల అనిన రామలక్ష్మణులు లేని సమయమున సీతను అధర్మముగా అపహరించి లంకకు తెచ్చి బంధించినప్పటికి **సీతామాతకు ఏడాది వరకు గడువు నొసగెను.** రావణుడు సీత అందముకు ముగ్ధుడై ప్రతిరోజు వచ్చి సీతపైనున్న మోహముతో సీతను వరించమని అహంకారపూరితమైన మాటలతో పలికెనే కాని **సీతాదేవిని తాకనైనా తాకలేదు. రావణాసురుడు కూడా రామాయణములో సుందరరావణుడే.**

రావణుడు పలికిన మాటలు విని సీతాదేవి తిరిగి జవాబు చెప్పెను, "నా పతి ఆజ్ఞ లేకపోవుటచే నేను ఊరకుంటిని గాని లేనిచో నిన్ను సంహరించెదను." సీత అందరిముందు ఆ విధముగా మాట్లాడుటచే రాక్షస రాజైన రావణుడు అందరిలో చులకనుడైనాడు. ఆ కోపముతో సీతను కాపలాకాచే రాక్షసులతో ఇట్లనినాడు, "సీతను ఏ విధముగానైనను ఒప్పించి తీరమని లేని యెడల భక్షించమని" ఆజ్ఞాపించినాడు. రావణుడు వెళ్ళిపోయిన పిదప సీత చుట్టూనున్న రాక్షసులు సీతాదేవిని ఒప్పించుటకు విశ్వ ప్రయత్నము చేసినారు. సీతను భయపెట్టి సీతను లొంగతీసుకొనుటకు ప్రయత్నించినను సీత వారిమాటలకు, బెదిరింపులకు లొంగలేదు. రాక్షస వనతిలు సీతను ముక్కలు ముక్కలుగా నరికి భక్షించెదమని అనినను సీత బెదరలేదు. సీత తన మనసులో మాత్రం రామలక్ష్మణులను తలచుకొని అచ్చటి రాక్షసుల బాధ నుండి విముక్తి కలిగించని కోరుకొనెను. సీతాదేవికి రావణాసురుడు తనకిచ్చిన గడువు రెండు నెలలలో తీరిపోవుననే మాట గుర్తుకుతెచ్చుకొనెను. బాధపడెను. ఈ రెండు నెలలలో ఒకవేళ శ్రీరామచంద్రుడు రక్షింపని యెడల రాక్షసులు తనను హతమార్చెదరని అట్టి నీచ రాక్షసుల చేతిలో మరణించుటకంటే తానే మరణించుట మేలని తలచెను.

రాం రామాయనమః

# అధ్యాయము - 14

శ్రీ రామ రామ రామ

రాజారామ్

అచ్యుతం కేశవం రామ నారాయణం

కృష్ణదామోదరం వాసుదేవం హరిమ్

శ్రీధరం మాధవం గోపికా వల్లభమ్

జానకీ నాయకం రామచంద్రం భజే (అచ్యుతాష్టకమ్)

లంకేశ్వరుడు సీతాదేవిని మాటలతో బాధపెట్టి అక్కడున్న రాక్షసులకు సీత నెట్లయినను ఒప్పించి దారికి తీసుకురమ్మని ఆజ్ఞాపించి వెళ్ళిన పిదప అక్కడున్న రాక్షస వనితలు సీతను ఒప్పించుట కిట్లనిరి, “రావణుడు దశకంఠుడు, తేజోవంతుడు, ధైర్యవంతుడు, బలవంతుడు, ధనవంతుడు, మహాబాహుడు, దేవేంద్రుడు కూడా రావణుడితో సరికాడు. ఎందరో మహావీరులను జయించెను రావణాసురుడు. అటువంటి మహాబలశాలిని కాదనక అంగీకరింపుము. లంకేశ్వరుడు నీవు అట్లు చేసినచో నిన్ను మహారాణిగా రాణులందరిలో పట్టపురాణిగా చివరకు రావణుని ప్రియసఖియైన మండోదరికన్న నిన్ను మిన్నగా చూచుకొనును. అంతటి ధనవంతుని భార్యగా ఉండుట నీ భాగ్యముకాక మరేమిటి ? ఎక్కడో అరణ్యములో నారబట్టలు ధరించి సీతా అనుచు తిరిగే రాముడు ఇంత దూరమువచ్చి నిన్ను కాపాడెదడని భావించుట వృథా. ఇక ఆ రాముడిని తలచుకన్న రావణుని ఏలుకొనుటయే. నీకు మేలు. ఒకవేళ నీవు ఈ విధముగా చేయని యెడల నిన్ను చిత్రహింసలను చేసెదము. ముక్కలు ముక్కలుగా వధించి మధువులో నంజుకుని ఆరగించెదము.” **సీతాదేవి సాక్షాత్తు శ్రీరాముని అర్ధాంగి. అటువంటి ఆ తల్లి ఇటువంటి బెదిరింపులకు బెదురునా ? రావణుని సంపదలకు లొంగునా ? శ్రీరాముని ఎడబాటుగా ఉన్నప్పటికి సీత మనసులో రాముడు చెదురునా.** సీతాదేవి ఆ రాక్షస వనితలతో ఇట్లనెను. “మాకు పతియే దైవము మేము మానవులము. మీరు రాక్షసులు కాబట్టి ధర్మా అధర్మములు తెలియనివారు. మీ రాజుకు నేను భార్యగా తగను. కావాలనుకుంటే నన్ను వధింపుము. నేను సిద్ధముగానున్నాను. రాక్షస రాజైన రావణునికి లొంగుటకన్నా మరణించుటయే మేలు. మీరు పెట్టే మభ్యకు, మాయకు, బెదిరింపులకు భయపడే దానిని కాను” అని సీత క్రూరదానవులతో పలుకగా ఆ రాక్షసులు తిరిగి సీతతో ఇట్లనిరి, “నీవు ఇంత చెప్పినను మాకు లొంగుటలేదు. మామాటను కాదనినావని మా రాక్షస రాజైన లంకేశ్వరుడికి చెప్పెదము” అని రాక్షస వనితలు బెదిరించి రావణుని కడకు వెళ్ళిరి.

ఆ రాక్షస వనితలలో ఒక వృద్ధ రాక్షసి కలదు. ఆమె నామధేయము త్రిజట. ఆ వృద్ధ రాక్షసి మిగిలిని రాక్షసులతో ఇట్లనెను, “నాకు భయంకరమైన స్వప్నము వచ్చినది. ఆ స్వప్నవృత్తాంతము ఏమనగా రామలక్ష్మణులు ఎంతో ప్రకాశవంతముగా తెల్లని వస్త్రములు ధరించి గజముపై లంకాపురమునకు వచ్చెను.

సీతాదేవిని తన పతి శ్రీరామచంద్రుడు తన సతిని తన అంకముపై చేర్చుకొనెను. దేవతలందరు సీతారాములకు లక్ష్మణులకు అభిషేకము చేయుచు నమస్కారములతో అర్చించుచున్నారు. మన రాక్షస రాజైన రావణాసురుడు నల్లని బట్టలు ధరించి పుష్పక విమానము నుండి ఒక్కసారిగా క్రిందపడి స్త్రీలచే నేలపై ఈడ్వబడినాడు. రావణుడు వరాహముపై ఊరేగుచు కనిపించినాడు. తన సోదరుడైన కుంభకర్ణుడు ఒంటెపైన తన కుమారుడైన ఇంద్రజిత్ మకరముపైన పారిపోవుచున్నారు. రాక్షసులందరు గుంపుగుంపుగా నలుమూలల భయముతో పారిపోవుచున్నారు. రావణుడు భయపడి వరాహముపై నుండి క్రిందపడి వస్త్రహీనుడై పరుగిడినాడు. విభీషనుడు తెల్లని ఏనుగుపై రాజలాంఛనాలతో గౌరవముగా పోవుచున్నాడు. రామబంటు ఒక వానరోత్తముడు రుద్రరూపుడై రావణుడు పరిపాలించే లంకను దహించినాడు. లంక సముద్రములో మునిగిపోవుట కనిపించినది. కావున మీరందరు ఇక సీతాదేవిని బాధపెట్టక శరణువేడి ఆమెను శ్రీరాముని కడకు పంపుము. లేనియెడల నాకు స్వప్నములో కనిపించినట్లుగా జరుగకమానదు. సీతామాత మహాపతివ్రత మిమ్ములను తప్పక క్షమించును. కావున నేను చెప్పినట్లుగా చేయుము" అని త్రిజట తన స్వప్న వృత్తాంతమును రాబోవు ఆపదను ముందుగానే రాక్షస వనితలకు చెప్పెను. **దైవము (శ్రీరాముడు) ఎంతో దయామయుడు. రాక్షస రాజైన లంకేశ్వరుడు నారాయణుడి భార్యను అపహరించినను ఆ రాక్షసరాజు ఇతర రాక్షసులతో ఎంతో సీతాదేవిని బాధపెట్టినను అటువంటి రాక్షసులకు ఆ దైవం (శ్రీరాముడు) తన కరుణను మాత్రము చూపకుండ ఉండలేదు. ఆ రాక్షసులలో ఒకానొక రాక్షసియైన త్రిజటకు రావణుడికి ఒక అవకాశమిచ్చెను. ఆ రాక్షసులు త్రిజట చెప్పిన రీతిగా చేసినట్లయితే ఆ దైవం (శ్రీరాముడు) చేతిలో రావణుడు, తన సోదరులు, కుమారులు మరియు రాక్షసులు మరణించేవారు కాదు.** ఆ దైవం (శ్రీరాముడు) మొట్ట మొదట సీతాదేవితో రావణుడికి మంచిమాటలు చెప్పినాడు. సీతను రాముడికి అప్పచెప్పమని శ్రీరాముడు క్షమాగుణము కలవాడని చెప్పినను రావణుడికి ఆ మాటలు ఎక్కలేదు. తదుపరి అసురగుణములు కల రాక్షసి త్రిజటకు స్వప్నము ద్వారా కూడా దైవం (శ్రీరాముడు) అవకాశం ఇచ్చినను సద్వినియోగము చేసుకొనలేదు. కావున **దైవము (శ్రీరాముడు) రక్షించేవాడేగాని శిక్షించేవాడు కాదని తెలుసుకొనవలెను.** రాక్షసులలో రాక్షసి అయిన త్రిజట రాక్షసికాదు ఆ త్రిజట సుందర త్రిజట.

సీతాదేవి రావణుడు తనకు ఒసంగిన గడువు మరిరెండు నెలలలో తీరిపోవునని కావున తాను ఎంతో శోకించుచు రామలక్ష్మణులను మనసారా పిలిచి తన కష్టములను చూడమని ఎంతో శోకించెను. సీత మరియు తన మనసులో ఇట్లనుకొనెనను. నా జాడ కొరకు ఇంతవరకు రామలక్ష్మణులు ఎవ్వరూ రాలేదు. ఆ మాయావి అయిన మారీచుడు నాపతిదేవుడు శ్రీరాముడిని మరియు నా మరిది లక్ష్మణుని చంపియుండునా ? ఆ బంగరు లేడిని చూచి ముచ్చటపడి కావలెనని కోరగా నా పతి శ్రీరాముడు దానికై వెంటపడి అడవుల పాలయ్యెను. రామలక్ష్మణులు లేని సమయమున రావణుడు నన్ను బంధించి లంకలో ఉంచెను. ఇంతటి అనర్ధమునకు కారణం ఆ లేడియే. దానిని కోరకున్న నాకీ శోకము వచ్చేడిది కాదుకదా?" అని సీతాదేవి ఎంతో బాధతో శోకించి తనకు గల గడువు ఇక రెండు నెలలలో తీరిపోవునని తలంచి రావణుడికి లొంగుట కంటే మరణించుటయే మేలని తలంచి కడసారిగా రాముడిని తలచుకొని తనమెడ జడతో ఉరిపోసుకొనుటకు ప్రయత్నము చేసెను.

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః

నై చైనం క్లేదయం త్యాపో న శోషయతి మారుతః (భగవద్గీత, అ-2, శ్లో.23)

ఈ ఆత్మను శస్త్రములు ఛేదింపజాలవు. అగ్ని దహింపజాలదు. నీరు తడుపజాలదు. వాయువు ఆరిపోవునట్లు చేయజాలదు.

రాం రామాయనమః

# అధ్యాయము - 15

శ్రీ రామ రామ రామ

రాజారామ్

జలేషు మాం రక్షతు మత్స్యమూర్తి

ర్యాదో గణేభ్యో వరుణస్య పాశాత్

స్థలేషు మాయా వటు వామనో వ్యాత్

త్రివిక్రమఃఖే వతు విశ్వరూపః (నారాయణకవచం)

అర్థం : జలచరముల చేతను, వరుణ పాశములతోను బంధింపబడకుండా మత్స్యావతార మూర్తి నన్ను కాపాడగలరు. బ్రహ్మచారియై మాయావటు మూర్తిని ధరించి మూడడుగులతో ముల్లోకముల నాక్రమించిన విశ్వజిత్ ప్రభువు చోటు నందలి అన్ని స్థలములందును నన్ను రక్షించును.

అట్లు సీతమాత తన ప్రాణము త్యాగము చేయబోగా ఆ మాత ఎడమ కన్ను మరియు ఎడమ భుజము అదురుట గమనించి అది శుభశకునములకు గుర్తుగా ఎరింగి సీతామాత ఆశతో వేచియుండెను. చెట్టు కొమ్మపై నున్న ఆంజనేయుడు తన మనోస్థితిని ఏ మాత్రము చెలింపనీయకుండా స్థిత ప్రజ్ఞతతో స్థిరముగా ఒక మునివలె తన ముందు జరుగుచున్నవన్ని గ్రహించెను. సీతామాతను చూడగనే తన మనసులో పరమానందము పొందెనుకాని ఆ ఆనందమును గంతులతో కాని లేదా వెంటనే సీతామాత ముందు నిలబడి జరిగిన వృత్తాంతమును చెప్పి సంతోషించుట చేయలేదు. అలాగే సీతామాత చెట్టు కొమ్మ క్రింద కటిక నేలపై నీరసించి దుఃఖముతో కృంగిపోవుట చూచిన పిదప కూడా మారుతి తన మనస్సులోనే దుఃఖము పొందెనుకాని వ్యక్తపరచలేదు. అలాగే రాక్షస రాజైన రావణాసురుడు సీత ముందు ఎన్న దంబములు పలికి కామపూరితమైన మాటలతో సీతాదేవిని బాధించినను చెట్టు కొమ్మపైనున్న ఆంజనేయునికి కోపము మనస్సులోనే వచ్చెనుగాని ఆ కోపాగ్నితో ప్రజ్వరిల్లి క్రిందకు దూకి రావణుడితో కలయబడలేదు. నిజానికి మారుతికి రావణుడితో కలయబడే శక్తి ఉన్నప్పటికి తన శక్తిని నిగ్రహించుకొని తన మనోస్థితిని తిరిగి

ప్రదర్శించుకొనినాడు. అటువంటి పరిస్థితి చాలాకష్టమైనది. మారుతికాక మరెవరైనా ఆ స్థితిలో ఉన్న యెడల అట్లు చేసేవారు కాదు.

సమశ్శత్రౌచ మిత్రే చ తథామానావమానయోః

శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగ వివర్జితః (భగవద్గీత, అ–12, శ్లో.18)

అర్థం : శత్రువుల యెడను మిత్రుల యెడను సమభావముతో మెలగువాడును మానావమానములు, శీతోష్ణములు, సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వములను సమానముగా స్వీకరించువాడు అసక్తి రహితుడును.

తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేనకీనచిత్

అనికేతః స్థిరమతిః భక్తిమాన్ యే ప్రియోనరః (భగవద్గీత, అ–12, శ్లో.19)

అర్థం : నిందాస్తుతులకు చలింపనివాడును, మనన శీలుడును శరీర నిర్వహణకై లభించిన దాని తోడనే తృప్తి పడువాడును నివాస స్థానములయందు మమతాసక్తుడు లేనివాడును, స్థితప్రజ్ఞుడును అగు భక్తుడు నాకిష్టుడు.

ఆంజనేయుడు తన శత్రువులైన రావణాది రాక్షసుల వశించు పురములో ఉన్నప్పటికిని తన మాత ఆ పురములో అశోకవనమున ఉండుట చూచినప్పటికిని రావణుని యందు మరియు సీతమాత యందు సమభావముతో మెలిగినాడు. అనగా రావణుడు సీతముందు డాంబికముగా మాట్లాడినను రాముని తక్కువగానెంచి తన బలమును గురించి గర్వముగా సీత ముందు చెప్పినను సీతముందు కామపూరితమైన మాటలతో వేధించినను **మారుతి తన మనోస్థితిని చెలింపకుండా ఒక మౌనివలె స్థితప్రజ్ఞతతో ఉన్నాడు.** అలాగే సీతమాత తనముందు అంతగా బాధపడుచున్నప్పటికిని తొందర పడక **మనోనిగ్రహుడై తన మనోస్థితిని నిశ్చలముగా నుంచి మౌనివలె స్థిత ప్రజ్ఞుడుగానేనున్నాడు.** అంటే **ఆంజనేయుడు శత్రువుల యెడను, మిత్రుల యెడను సమభావముతోనే ఆ సమయమున మెలగినాడు.** అవమానములను భరించినాడు. రావణుని నిందలకు చెలించలేదు. ఆ చెట్టుకొమ్మపై శీతోష్ణములకు సుఖదుఃఖములకు సమానముగా స్వీకరించి మననశీలుడై ఒక మౌనివలె మమతాసక్తులు లేకుండా స్థితప్రజ్ఞతతో మెలగినాడు. కావుననే శ్రీరామచంద్రునికి ముఖ్యభక్తుడై మెలగినాడు.

చెట్టు కొమ్మపైనున్న ఆంజనేయుడు సీతామాత యొక్క అవస్థను చూసి తన తల్లిని ఊరడించవలెనని రాక్షసుల నుండి కాపాడవలెనని తలంచి రామకథ చెప్పుట ప్రారంభించెను. "కోసల రాజ్యము ఏలే దశరథ మహారాజు జ్యేష్ఠ పుత్రుడు అగు శ్రీరాముడు ధర్మ రక్షకుడు. పితృవాక్య పరిపాలకుడు. అటువంటి రాముని అయోధ్యా పురమునకు రాజుగా చేయుటకు దశరథుడు నిర్ణయించి పట్టాభిషేకము చేయు సమయమున దశరథుని భార్యయగు కైకేయి తనకు రెండు వరములు ప్రసాదించమని అందు మొదటిది భరతునకు

పట్టాభిషేకము, రెండవది శ్రీరాముడు 14 యేండ్లు వనవాసము. తండ్రిమాటను నిలుపుటకై రామచంద్రుడు సీతాలక్ష్మణ సమేతుడై వనవాసమునకేగెను. ఎందరినో రాక్షస వీరులను హతమార్చెను. సీత కోర్కెపై మాయాలేడిని పట్టుటకు శ్రీరాముడు వెడలెను. రావణుడు రామలక్ష్మణులులేని సమయమున సీతను అపహరించెను. శ్రీరాముడు సీతకై పరితపించుచున్న సమయమున సుగ్రీవుడు, అంగదుడు, వానరయోధులు రామునికి మిత్రులై రామకార్యము నెరవేర్చుటకు సిద్ధమైరి. రాముని ఆజ్ఞనుగైకొని వానర వీరులు సీతజాడకై నలువైపులా వెతుకుట ప్రారంభించిరి. లంకాపురములో సీత బంధీయై యున్నదని పక్షిరాజు శ్రీరామునికి చెప్పుటచే నేను శత యోజనముల వారధిని శ్రీరాముని ఆశీర్వచనముచే దాటి లంకకు చేరితిని. రాముడు తెలిపిన గుర్తులచే సీతామాతను లంకలో కనుగొంటిని" అని ఆంజనేయుడు చెట్టుకొమ్మపై నుండి రామకథను మృదుమధురముగా గానముచేసి ఆపెను. చెట్టుక్రిందనున్న సీతామాత తేనెలొలికే ఆ రామకథ వింటూ విస్మయము పొంది ఆగగనే ఒక్కసారిగా నలుదిక్కులు మరియు పైకి చూచెను. ఆ చెట్టు శాఖల మధ్య కొమ్మపై దివ్యతేజముతో **మారుతి బాలుని వలె కన్పించుట గమనించి** సీత భయముచెందెను. ఆంజనేయుడు సీతామాత ఎదురుగా చెట్టుకొమ్మపై నుండి క్రిందికి దుమికి నిలబెడను. శ్రద్ధాభక్తులతో తన రెండు చేతులను జోడించి మనస్ఫూర్తిగా సీతామాతకు నమస్కరించి ఇట్లనెను. "తల్లీ! నీవు రాముని సీతవా ? రావణాసురుడు రఘునందనుడు లేని సమయమున అపరహించిన నా స్వామి సీతవు నీవేనా ? నీ జాడ తెలియక రామలక్ష్మణులు వనమంతా వెతుకుతున్నారు. నీవెవరివో తెలుపుము తల్లీ" అని ఆంజనేయుడు సీతామాతను వేడుకొనెను. సీతాదేవి మారుతితో ఇట్లు పలికెను, "నేను జనక మహారాజు పుత్రికను, దశరథ మహారాజు కోడలును, శ్రీరాముని సతిని. నా నామధేయము సీత. శ్రీరాముడు శివధనుస్సును సభాముఖమున విరిచి నన్ను పరిణయమాడెను. శ్రీరామునితో భోగభాగ్యములు అనుభవించితిని. అట్టి సమయమున దశరథుని భార్య అయిన కైకేయి వరములను నెరవేర్చుటకు నాపతి వనవాసమునకు పోవుచున్న నేను మరియు సౌమిత్రియు రామునితో కలిసి వనవాసమునకేగినాము. రావణుడు మాయాలేడిని పంపి నన్ను అపహరించుటకు పన్నాగమాడినాడు. ఆ లేడి భ్రాంతిలో పడిన నేను శ్రీరామునితో ఆ బంగారు లేడి కావలెనని కోరగా రాముడు ఆ లేడిని పట్టుకొనుటకై దాని వెంట పడినారు. రాక్షస రాజు రావణుడు రామలక్ష్మణులు లేని సమయమున నన్ను అపహరించి ఈ లంకలో బంధించినాడు. నాకు రావణుడు డాది గడువు ఇచ్చినాడు. ఇంకా రెండు నెలలలో ఆ గడువు తీరిపోవును. అంతవరకు రావణుడు నన్ను అంటనని మాటిచ్చినాడు. రెండు నెలలు గడిచిన పిదప రావణుడు ఇక ఊరుకోడు. నాపై మోహము చెందినాడు. ఆ రావణుడు ఇక మంచి మాటలకు లొంగడు. రాముడు నన్ను కాపాడుననే ఆశతో వేచియుంటిని. రాక్షసుల బారినుండి తప్పించుకొనుటకు ఆ దుష్ట రావణునికి లొంగుట కంటే మరణమే మేలని తలచినాను.

ఈ విధముగా ఆంజనేయుడు సీతముందు నిలబడితాను లంకకు రాగలగుటకు గల కారణమును సీతకు చెప్పుట మరియు సీతాదేవి తాను సీతయా కాదోనని అడుగుట మరియు ఆ తల్లి తన గురించి తాను లంకలో బందించుటకు గల కారణములు చెప్పుకొనుట జరిగినది. **ఒకరినొకరు ఈ విధముగా చెప్పుకొనుటకు గల కారణము వారిరువురు ఉన్న స్థలము రావణాసురుడి స్థలము. అది మాయతో కప్పి ఉండును. ఏది నిజమో ఏదికాదో అని తెలుసుకొనుట కష్టము.** కావుననే మారుతికి సీతాదేవికి అంతగా

ప్రశ్నించుకొనుట తనను గురించి తాను చెప్పుకొనుట వచ్చినది.

ఆంజనేయుడు సీతామాతకు నమస్కరించి తాను రామదూత అని రామలక్ష్మణులు క్షేమమని తల్లిసీత జాడను తెలుసుకుని తిరిగి రమ్మన్నారని మారుతి పలికినను జానకి మారుతిని ఇంకా అనుమానించెను. **ఎందుకంటే రావణుడు మాయావి. తాను ఈ వానరుడు రూపంలో వచ్చియుండెనేమోయని సంశయము చెందెను.** కావున మారుతి ఎంత చెప్పినను సీతాదేవి నమ్మలేదు. ఆంజనేయుడు తిరిగి తల్లిసీతకు ధైర్యము చెప్పెను. శ్రీరాముడు తప్పకవచ్చి తనను రక్షించునని రామబాణముతో రావణాసురుడు తప్పక మృతిచెందునని రావణాసురుడి బలమును మరియు నీ జాడను తెలుసుకురమ్మని నన్ను శ్రీరామచంద్రుడు ఈ లంకకు పంపెనని ఆంజనేయుడు సీతాదేవితో పలికెను.

రాం రామాయనమః

# అధ్యాయము - 16

శ్రీ రామ రామ రామ

రాజారామ్

దుర్గేష్వటవ్యాజి ముఖాదిషు ప్రభుః

పాయాన్నృసింహో సురయూధపారిః

విముంచతోయస్య మహాట్ట హాసం

దిశో వినేదుర్న్యపతంశ్చత గర్భాః (నారాయణవచనం)

అర్ధం : దానవస్త్రీల గర్భస్రావ మగునట్లు పకపకా నవ్వుచు గర్జించుచున్న శ్రీ నృసింహమూర్తిని ధ్యానించెదను. దానవాంతకుడైన హే నృసింహమూర్తీ! అడవుల నందలి ప్రమాదము నుండి యుద్ధముల నుండి రక్షించునుగాక.

మారుతి తన రాక రహస్యమును గురించి సీతామాతకు చెప్పగా సీతాదేవి ఇంకను మారుతిని రామలక్ష్మణులను ఎట్లు ఎరింగితివని ప్రశ్నించెను. వారి గుణగణములను కూడా అడిగెను. సీతామాతకు నమ్మకము కల్గించుటకై ఆంజనేయుడు ఈ విధముగా పలికెను. "సుగ్రీవుడును మా వానరవీరులందరూ సేవించుచున్న సమయమున అచ్చటకు రామలక్ష్మణులు వచ్చుట కాంచినాము. శ్రీరాముడు కమలముల వంటి నేత్రములు కలవాడు. ఎనిమిదడుగుల దీర్ఘకాయుడు. విశాల వక్షుడు. అందమైన నాసికము మరియు సుందర అవయవములు కలిగినవాడు. నల్లని జుట్టు సువర్ణ వర్ణముతో ప్రకాశించే శ్యామసుందరుడు. శంఖము వంటి కంఠము కలవాడు. ఆజానుబాహుడు. క్షమాగుణము కలవాడు. దయాసాగరుడు. సర్వధర్మములను రక్షించుటకై వచ్చిన దేవాదిదేవుడు. శ్రీరాముని సోదరుడైన లక్ష్మణుడు ఆ అన్నకు తగ్గ

సోదరుడువలె అన్నింట సరిపోలువాడు. ఆ చూడముచ్చటైన సోదరులను అక్కడకు రావుట గమనించినాము. వారి వృత్తాంతము తెలుసుకుంటిమి. సుగ్రీవరాజు రామునితో మైత్రి పొందెను. వాలి సుగ్రీవులు అన్నదమ్ములు. వారు ఇరువురికి పడేదికాదు. తమ్ముని భార్యను వాలి అపహరించుట వలన సుగ్రీవుడు వారి బారినుండి రక్షింపమని శ్రీరాముని కోరగా రాముడు వాలిని సంహరించెను. సుగ్రీవుడు మా వానరసేనలందరు రామలక్ష్మణులను సేవించుచు శ్రీరామునికి వచ్చిన కష్టమును విని సీతజాడ కనుగొనుటకు మా వానరవీరులు నలువైపుల పరుగిడిరి. అంగదుడు మరికొందరు దక్షిణ దిశగా పయనించినాము. రావణుడు నిన్ను అపహరించి లంకలో బంధించినాడని పక్షిరాజు పంపాతి మాట విని రామలక్ష్మణులు మరియు వానర వీరులు నన్ను లంకకుపోయి సీతజాడ కనుగొని రమ్మని నన్నిచటికి పంపినారు. వానర రాజు సుగ్రీవుని మంత్రిని నన్ను హనుమంతుడని నీ జాడ తెలుసుకొనుటకు వచ్చినాను. రావణాసురుడు నిన్ను అపహరించి ఆకాశమార్గమున పోవు సమయమున ఋష్యమూకమున నీవు క్రిందికి వదిలిన సొమ్ములు మాకడనున్నవి. ఆ ఆభరణములు కాంచిన శ్రీరామచంద్రుడు ఎంతో విలపించెను. నీ జాడ తెలియక రామచంద్రుడు నిద్రాహారములు మానినాడు. నీవు అశోక వనమున కొన్ని ఆభరణములను చెట్టుకొమ్మకు తగిలించి నిట్టూర్పుతో రామునికై తపించుచు ఉండుట చెట్టుకొమ్మపై నున్న నేను ఆ ఆభరణములను గుర్తించి మిగిలిన ఆభరణములు నీవు క్రిందికి పడవేసినవి మాకడనున్నవి. అంజనీదేవి మాల్యవంతమను నగరమున నున్న కేసరి బ్రాహ్మణుని సతి. వాయుదేవుని వరము వలన నన్ను కన్నది. కన్నతల్లి నన్ను ప్రాణ ప్రదముగ చూచినది. సుగ్రీవునకు మంత్రినైన నేను రామభక్తుడను, రామదూతను రామకార్యార్థమునకై నేను ఇచ్చటకు వచ్చినాను. నీ క్షేమము తెలుసుకొనుటకు రాముడికి తెలియపరుచుటకు నేను ఇక్కడకు వచ్చినాను" అని హనుమంతుడు సీతాదేవికి రామలక్ష్మణుల రూపురేఖలను వారిని కలుసుకొను విధానమునమును తాను లంకకు వచ్చుటకు గల కారణము మరియు తన జన్మ వృత్తాంతమును గురించి ఆ తల్లి సీతాదేవికి విన్నవించెను.

ఆంజనేయుని వృత్తాంతమును విన్న సీతాదేవి అతడు నిజముగనే రామదూత అని మారుతి చెప్పినవన్నీ నిజమేనని నమ్మెను. ఆంజనేయుడు సీత జాడకై లంకకు పయనమయ్యే సమయమున శ్రీరామచంద్రుడు మారుతికి ఒక అంగుళీయకము నిచ్చెను.ఆ అంగుళీయకమును సీత కనిపించిన పిదప చూపించమని శ్రీరాముడు మారుతికిచ్చి ఆజ్ఞాపించెను. గురుదేవుని ఆజ్ఞను నెరవేర్చుటకై మారుతి శ్రీరాముడిచ్చిన అంగుళీయకమును సీతాదేవికిచ్చెను. శ్రీరామచంద్రుని ముద్రికను చూచి సీతామాత మారుతి రామబంటని తనరాక సీత జాడకేనని ఇంకను నమ్మెను. శ్రీరాముని ముద్రికను తీసుకుని ఆ తల్లి తన కనులనిండ నీళ్ళతో నింపుకుని ఆ ముద్రికను కనుల కద్దుకొనెనను. మారుతి కార్యమును మెచ్చి మారుతితో సీతామాత ఇట్లు పలికెను, "ఇంతటి మహాసముద్రమును దాటి ఒంటిగా నీవు శ్రీరామకార్యమును నెరవేర్చుటకై లంకకు వచ్చితివి. ఎందరో రాక్షస వీరులను లెక్కచేయక రావణుడు వంటి మహాబలశాలి ఈ లంకకు రారాజు మరియు క్రూరరాక్షసుడు అని తెలిసికూడా శతయోజనముల వారధిని దాటి నా జాడ కనుగొనుటకు ఎంతో శ్రీరామభక్తి పరాయణుడవై రామకార్యము నెరవేర్చుటకై ఒంటరిగా ఇక్కడు వచ్చితివి. శ్రీరాముడు లక్ష్మణ సమేతుడై ఈ లంకకు వచ్చి ఎప్పుడు నన్ను కాపాడెదరో కదా! ఈ రాక్షసుల బారినుండి నన్నెపుడు తప్పించగలరో. రావణుడు ఒసగిన ఏడాది గడువు ఇక రెండునెలలలో తీరిపోవుచున్నది" అని సీతామాత

మారుతి భక్తికి నిస్వార్ధసేవకి బలపరాక్రమములకు మరియు ధైర్యమునకు మెచ్చి ఆ తల్లి సంపూర్ణ ఆశీస్సులను మారుతికిచ్చెను.

అనపేక్షః శుచిర్దక్షః ఉదాసీనో గతవ్యథః

సర్వారంభపరిత్యా గీయో మద్భక్త స్సమేప్రియః (భగవద్గీత, అ-12, శ్లో.16)

అర్థం : కాంక్షలేనివాడు శరీరేంద్రియ మనస్సులయందు శుచియై ఉన్నవాడు దక్షుడును, పక్షపాతరహితుడు, ఎట్టి దుఃఖములకును చలింపనివాడును, సమస్త కర్మలయందును కర్తృత్వాభిమానము లేనివాడును అగు భక్తుడు నాకు ప్రియుడు.

మారుతికి ఏ కాంక్షలేదు. తన కార్యము శ్రీరామునికి సేవ చేయుటయే రామ కార్యమును నెరవేర్చుటయే మారుతి యొక్క కాంక్ష. లంకలో మారుతి ప్రవేశించిన పిదప ఎన్నో చూడరానివి చూచినప్పటికి మారుతి బాహ్యాభ్యాంతరములయందు శుచియై యున్నాడు. సీత జాడ కనుగొనుటకు రామకార్యము నెరవేర్చుటకు మారుతి ఎంతో నిపుణుడు. ఆ కార్యార్థమునకు తన స్వార్థమును చూచుకొనక పక్షపాత రహితుడై ప్రవర్తించినాడు. లంకలో ఎందరో రాక్షసులు బాధపెట్టినప్పటికి దుఃఖమునకు చలింపక తాను చేయు సమస్త కర్మలను కర్తృత్వాభిమానము లేకుండా ఉండుటచే ఆ శ్రీరామునికి అనన్య భక్తుడై ఆ నారాయణుడికి ప్రియుడైనాడు.

ఆంజనేయుడు సీతామాత దుఃఖమును చూచి ఇట్లనెను, “తల్లీ నా ప్రభువు రామచంద్రుడు నీవలెనే నిద్రాహారములను మాని నీవు రాముని ఎట్లు తలచుచున్నావో అట్లే శ్రీరాముడు మిమ్ములను తలచుచున్నారు” అని పలుకగా సీతాదేవి మారుతితో ఇట్లు పలికెను. “హనుమాన్! నిన్ను గనినంతనే మరియు నీ వృత్తాంతము శ్రీరామచంద్రుని యోగక్షేమములు వినినంతనే నాకు ఎంతో ప్రశాంతత కల్గినది. నాయీ బాధను శ్రీరామప్రభువునకు విన్నవించి రావణుడు ఒసగిన గడువు లోపలే నా ప్రభువును రమ్మని నన్ను రక్షించమని తెలుపుము.” సీతాదేవి విన్నపము విన్న మారుతి తిరిగి తన తల్లితో ఇట్లనెను, “తల్లీ! నీ బాధను నేను ఇప్పుడే తొలగించెదను. నీ బంధములను విడిపించెదను. నా వీపుపై కూర్చొనుము. ఈ క్షణమునే తిరిగి నిన్ను రామునికడకు తీసుకుపోయెదను.” **ఆంజనేయుడు తన బలపరాక్రమములను తల్లి సీతాదేవి ఎదుట చెప్పుకొనలేదు. ఎటువంటి ప్రగల్భములు పలుకలేదు.** కాని సర్వాంతర్యామియైన ఆ శ్రీహరి సతీమణి మారుతి రామకార్యార్థమునకై ఒంటరిగనే బయలుదేరి ఎన్నో కష్టాలను ఎదుర్కొని శత యోజనములు గల వారధిని దాటి లంకను గుర్తించి లంకలో ప్రవేశించి లంకా రాక్షసిని ఎదుర్కొని సీతజాడకై అణవణువు అన్వేషించి చివరకు అశోక వనమున సీత జాడను కనుగొని తన వృత్తాంతమును సీతా మాతకు తెలిపినపుడు ఆ తల్లి సీతాదేవి మారుతి మనోస్థితిని మరియు ధైర్యమును రామకార్యార్థమునకు సాహసించిన విధానమును మెచ్చుకొనెను. కాని ఆంజనేయుడు సీతామాతను చెరనుండి విడిపించుటకై తన వీపు మీద కూర్చొనమని తాను వెంటనే శ్రీరామునికడకు తీసుకు వెళ్ళెదనని అనినప్పుడు సీతాదేవి మారుతి బలపరాక్రమము తెలియక ఇట్లనెను, “ఓ హనుమాన్! నీవా చిన్న శరీరము దాల్చియున్నావు. నీవు నీ వీపుపై నన్ను కూర్చుండపెట్టుకుని

ఏ విధముగా నన్ను శతయోజనములు గల వారధిని దాటించి నా ప్రభువు శ్రీరాముని కడకు తీసుకుని వెళ్ళెదవు ? రాముని కడకు నన్ను చేర్చెదవో లేదా నడి సంద్రములో నన్ను జారవిడిచెదవో ? " అని సీతాదేవి మారుతితో తన సంశయమును ప్రకటించెను. సీతాదేవి పల్కిన మాటలు విన్న హనుమంతుడు తన కాయమును కొండంతగా పెంచి ప్రకాశవంతుడై సీత ఎదుట నిలిచెను. సీతాదేవి మారుతి రూపమును గాంచి ఆశ్చర్యము చెందెను. ఆంజనేయుడు ఎంతటి ఘనుడో బలపరాక్రమశాలియోయని గమనించెను. **మారుతి అవసరము వచ్చినది కాబట్టే తన నిజ రూపమును ప్రదర్శించెను. లేనియెడల ఆంజనేయుడు సామాన్యుని వలె ప్రవర్తించెడివాడు.** తన మనోస్థితి ఎంత గొప్పదో మరియొకసారి ఋజువైనది. దివ్యప్రకాశ తేజోమయముతో వెదజల్లుచున్న ఆంజనేయుని చూచి సీత ఇట్లనెను, "ఓ పవనకుమారా! శాంతింపుము. నీ బలపరాక్రమమెరుగక అట్లంటిని. నిజానికి నీవు తప్ప ఈ శతయోజనముల పరిధి గల వారధిని దాటగల వీరుడెవరు ? నీవు నీ వీపుపై నన్ను కూర్చుండబెట్టినను నీవు అతివేగముగా తిరిగిపోవుచున్న సమయమున నేను భయపడి క్రింద పడవచ్చును. లేదా నను గొనిపోవునపుడు రాక్షసవీరులు నిను గాంచి నీతో యుద్ధము చేయవచ్చును. ఆ రాక్షసులకు పలు రకములు అస్త్రశస్త్రములు కలవు. నీవు ఒక్కడివే అంతమందితో యుద్ధమెలా చేయగలవు. ఒకవేళ నీవు వారితో కలియబడినను నీ మూపుపైనున్న నన్ను మోయుచు ఆ రాక్షసులతో ఎట్లు పోరాడెదవు ? అట్టి యుద్ధమున రాక్షసులే నిన్ను గెల్చినారనుకొనుము అప్పుడు రామకార్యము వ్యర్థమగును. ఒకవేళ నీవే ఆ రాక్షసులను హతమార్చి నన్ను శ్రీఘ్రముగ శ్రీరాముని కడకు చేర్చిన నా రామచంద్రుడికి అది కీర్తి కరమా ? శ్రీరాముడే ఇక్కడకు వచ్చి రాక్షసులను సంహరించి దశకంఠుని అహంకారమును దించి హతమార్చినచో అప్పుడే నా మనస్సుకు శాంతి కలుగునని" సీతామాత మారుతితో పలికెను. **సీతాదేవి ఆంజనేయునికి తన కర్తవ్యమును గుర్తుచేసినది.** హనుమంతుడు ఎంతో బలవంతుడని తాను రాక్షసులను ఎదిరించి జయించే శక్తి కలవాడని సీతాదేవికి తెలుసు. అట్లని ఆంజనేయుని ప్రోత్సహించలేదు. కారణం **రావణుడి మరణం రాముని చేతిలో లిఖితమైయున్నది.** పైగా శ్రీరాముడు సీతజాడ కనుగొనుటకు ఆంజనేయుని లంకకి పంపుచూ సీత జాడను మాత్రమే తెలుసుకొని రమ్మన్నాడు. కావున సీతాదేవి మారుతి కర్తవ్యమును గుర్తుచేసి శ్రీరాముని మాట నిలబెట్టుటకై హనుమంతునికి హితబోధ చేసినది.

ఆంజనేయుడు తల్లి మాటనువిని ఇట్లనెను, "మాతా! నీ బాధ తప్పించుటకు నిన్ను కాపాడవలెననే కాంక్షతోను మరియు నీయందు గల భక్తిచే నేను అట్లు పలికితిని. నీవు చెప్పిన అమూల్య వాక్యములన్ని రామునికి తెలిపెదను. శ్రీరామచంద్రుడు తన అంగుళీయకమును గుర్తు కొరకై నీకు చూపమని పంపిన విధముగా మీరును ఏదో ఒక గుర్తుగా నా ప్రభువుకి చూపుటకు ఇమ్ము" అని ఆంజనేయుడు సీతామాతతో విన్నవించుకొనెను. మారుతి పలికిన పలుకులు విని సీతామాత ఆంజనేయునితో ఇట్లనెను, "నేను క్షేమమని రామలక్ష్మణులకు తెలుపుము. వారి రాకకై వేచియున్నానని చెప్పుము. రావణుడిచ్చిన గడువు రెండు నెలలలో తీరిపోవునని చెప్పుము. శ్రీరామునికి అతి ప్రియమైనది నాయీ చూడామణిని చూపించుము" అని జానకి తన చెంగుముడి విప్పి చూడామణిని తీసి ఆంజనేయుని చేతిలో పెట్టెను. మారుతి తన తల్లి ఇచ్చిన చూడామణిని మహాప్రసాదముగా భావించి కనుల కద్దుకుని తన తల్లి చుట్టు ప్రదక్షిణ చేసి సీతామాత

పాదపద్మములకు నమస్కరించి తిరిగి వెళ్లుటకు సీతాదేవి అనుమతిని కోరెను. సీతామాత హనుమంతునితో ఇట్లనెను, "నా యీ శోక భారమును నీవున్న ఈ స్వల్పకాలములో తగ్గెను. నీవు వెడలిన యెడల నాకెవరు దిక్కు ? ఈ శతయోజనములు పరిధిగల వారధి నీవు దాటి వచ్చినట్లుగా మిగిలిన వానరసేనలు రామకార్యమును నెరవేర్చుటకై ఈ లంకకు వచ్చి రాక్షసులతో పోరాడెదరా?" అనే సంశయమును సీతామాత ప్రకటించగా ఆంజనేయుడు, సుగ్రీవుడు, అంగదుడు, జాంబవంతుడు మొదలగు వీరుల శక్తిని గురించి వానరులందరికి రామ భక్తిని గురించి సీతాదేవికి చెప్పెను. పైగా మారుతి తల్లిసీతతో ఇట్లనెను. నా భుజములపై రామలక్ష్మణుల నుంచి లంకకు నేను తీసుకుని వచ్చెదను. రావణుడికి కాలం సమీపించినది. అతను మరణించుట తథ్యం. రాక్షసులను సంహరించి నిను గైకొని తిరిగ అయోధ్యా పురమునకు పోదాము అని మారుతి సీతకు ధైర్యము చెప్పి అంజలి ఘటించి తిరుగు ప్రయాణమయ్యెను.

రాం రామాయనమః

# అధ్యాయము - 17

శ్రీ రామ రామ రామ

రాజారామ్

పశ్యామి దేవాం స్తవ దేవ దేహే

సర్వాంస్తథా భూతవిశేష సంఘాన్

బ్రహ్మాణ మీశం కమలాసనస్థమ్

ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్

అనేక బాహూదరవక్త్ర నేత్రం

పశ్యామి త్వాం సర్వతో నంత రూపమ్

నాంతం న మధ్యం న పునస్తవాదిం

పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప (భగవద్గీత, అ-11, శ్లో.15&16)

అర్థం : దేవాదిదేవా ! నీ విరాట్ రూపమునందు సకల దేవతలను నానావిధ ప్రాణులను, బ్రహ్మను, శివుడును, సర్వఋషులను, దివ్య సర్పములను చూచుచున్నాను. నీ బాహువులు, ఉదరము, ముఖములు, నేత్రములు, అసంఖ్యములు. నీ అనంత రూపము సర్వతోముఖముగా విలసిల్లుచున్నది. నీవు ఆది మధ్యాంత

రహితుడవు. మహత్వపూర్ణమైన నీ దివ్యరూపమునకు ఆది మధ్యాంతములను తెలుసుకొనలేకున్నాను.

**ఆంజనేయుడు ఇకపై తన విశ్వరూపమును చూపనున్నారు.** తల్లి ఆజ్ఞనుగైకొని మారుతి మరలుతూ రావణుని మరియు అతని బలగమును పరిశీలించుటకు ఆ రాక్షసుల శక్తిని గ్రహించి తన ప్రభువు శ్రీరామునికి తెలుపవలెనని మరియు దానవులకు దండోపాయమే తగినదని కల్పించుకొని కలహము పెంచుకొనవలెనని హనుమంతుడు నిశ్చయించుకొనెనను. మారుతి తన విశ్వరూపమును చూపుటకై స్థంభముపైన నిలిచెను. అక్కడున్న చెట్లను పీకి వాటి కొమ్మలను సునాయాసముగా విరిచి గిరి శిఖరములను బ్రద్దలు కొట్టి పురములోని ఇళ్ళ మెట్లను ముక్కలుచేసి ఆ అశోకవనమును భీభత్సము చేయుట ప్రారంభించినాడు హనుమంతుడు. జలాశయములకు అడ్డున్న గట్టులను తెంచినాడు. చెట్లపై కాచిన ఫలములను నేలగూర్చి పట్టణ ప్రాకారములను మరియు ద్వారములను పగులగొట్టి సుందరమైన ఆ అశోకవనమును క్షణములో అల్లకల్లోలము సృష్టించినాడు. ఆంజనేయుని చేష్టలు గమనించిన పక్షులు, మృగములు భయపడి నలుదిక్కుల పరుగిడిపోయెను. ఒక్క సీతాదేవి ఉన్న ప్రాంతమును విడిచి ఆంజనేయుడు చుట్టు ప్రక్కలనున్న ప్రాంతములన్నిటిని ధ్వంసము చేయుట ప్రారంభించినాడు. మారుతి చేసే ఆ భీభత్స ధ్వనులకు భయపడి లంకాపురములోనున్న రాక్షసులు జరుగనున్నది గాంచి వారి రాజైన లంకేశ్వరునికి విన్నవించుకొనినారు. దశకంఠుడు ఆ వానరుడు లంకలో ఎట్లు ప్రవేశించెనోనని ఆశ్చర్యచకితుడై కోపముతో ఆ వానరుణ్ణి శిక్షించమని 80 వేల కింకరుల వీరులను మారుతిపై దాడికి వదిలినాడు. ఆ రాక్షసులు పలురకాల ఆయుధములను ధరించి హనుమంతునిపై దాడికిపోగా ఆంజనేయుడు తన వాలమును పెంచుట ప్రారంభించినాడు. మారుతి తన వాలమును భూమిపై గట్టిగా మోదగా పెద్ద ధ్వని పుట్టి భూమి కంపించినట్లయ్యెను. చుట్టుప్రక్కలనున్న దిక్కులతో సహా అదిరిపోయెను. క్రూరమృగములతో సహా భయపడి పరిగెత్తగా పక్షులు బెదిరిపోయి నేలకూలెను. ఆంజనేయుడు అక్కడితో ఆగక తన శరీరమును పెద్దది చేయుచూ పెంచుకుంటూ పోయెను. తన విశ్వరూపమునకు తట్టుకొనలేక కొందరు రాక్షసులు మూర్ఛిల్లెను. రావణుడు పంపిన అసురులు మారుతిపై యుద్ధమునకు రాగా హనుమంతుడు స్థంభములను చెట్లను కొమ్మలను రాళ్ళను కొండలను పెకలించి వారిపై విసిరి ఆ 80 వేల కింకరులను మారుతి హతమార్చెను. రాక్షస రాజైన రావణాసురుడు ఈ వృత్తాంతము విని జంబుమాలిని మారుతిపై యుద్ధమునకు వదిలెను. జంబుమాలిని సామాన్యమైన రాక్షసుడు కాదు. అతి బలవంతమైనవాడు. తన రథమునకు గాడిదలను కట్టుకుని రోషముతో గర్జన చేయుచు మారుతితో యుద్ధమునకు దిగెను. అతను తన శక్తివంతమైన బాణములను వాయుపుత్రునిపై ప్రయోగింపగా అవి మారుతిని గాయపరచెను. ఒకరినొకరు పెద్ద బండలతో, స్థంభములతో విసురుకొనుచు ఘోర యుద్ధము చేసెను. ఆంజనేయుడు జంబుమాలిని సంహరించుటకాక తన సర్వసైన్యమును కూడా నేలకూల్చెను. అతీతమైనటువంటి శక్తిని కలిగియున్న ఆ కపి కిషోరుడు సామాన్యమైన వానరుడు కాదని రావణాసురుడు గ్రహించి తన మంత్రి కుమారులను హనుమంతునిపై దాడికి పంపెను. వారు ఏడుగురు. అందరూ కలిసి హనుమంతుని ఒక్కడిపై దాడికి దిగెను. పవనకుమారుడు తన బలపరాక్రమముతో ఆ ఏడుగురు మంత్రి కుమారులను చీల్చిచెండాడెను. లంకాపురమున ఎటుచూచిన రాక్షసుల మృతదేహములతో నిండినది. చివరకు మంత్రికుమారులు కూడా మరణించినారనే వార్త రావణాసురుడు విని ఆశ్చర్య చకితుడయ్యెను. చివరకు తన సేనాపతులను ప్రోత్సహించి

మారుతిపై దాడికి వదిలెను. సేనాపతులు వివిధ రథములతో యుద్ధమునకు దిగెను. వారు అతి భయంకరమైన ఆయుధములను ధరించి హనుమంతునిపై చుట్టుముట్టెను. హనుమంతుడు వారందరితో ఘోరముగా పోరాడి సేనాపతులను మరియు వారి సైన్యముతోసహా పవన కుమారుడు సంహరించెను. ఈ వార్త వినిన రావణాసురుడు మిక్కిలి కోపముతో రుసరుసలాడుచు చివరకు తన కుమారులను మారుతిపై యుద్ధమునకు దింపుటకు యోచించెను.

రావణాసురుడు తన బలగము తగ్గిపోవుట గమనించి ఇక తన సొంత కుమారులను కూడా బలిచేయుటకు సిద్ధుడయ్యెను. అప్పటికే 80 వేల కింకరవీరులు, ఎందరో రాక్షసులు, జంబుమాలిని, మంత్రి కుమారులు, సేనాపతులైన విరూపాక్ష, ఉపాక్షుల దుర్ధర ప్రగస భాస కర్ణులతో సహా రావణాసురుడు అప్పటికే కోల్పోయాడు. తన పతనానికి నాందిగా కనిపించినప్పటికి అంతటితో ఆపక రావణుడు తన కుటుంబ సభ్యులను రణరంగములో దింపుటకు సిద్ధుడయ్యెను. **కాని రామబంటు అయిన ఆంజనేయుని శక్తిని ఇంతగా ఉంటే మరి ఆ నారాయణుడైన శ్రీరామచంద్ర ప్రభువు శక్తి ఇంకెంతటిదో కదాయని ఊహించలేకపోయినాడు.** తనకున్న బల ధన సైన్య గర్వముతో కళ్ళు కప్పి జరుగబోవునది యోచించక చివరకు తన కుమారులనుకూడా కోల్పోవుటకు సిద్ధమైనాడు. **వినాశకాలే విపరీత బుద్ధి అంటే ఇదే కాబోలు.**

రాం రామాయనమః

# అధ్యాయము - 18

శ్రీ రామ రామ రామ

రాజారామ్

అనాది మధ్యాంత మనంతవీర్యమ్

అనంతబాహుం శశి సూర్యనేత్రమ్

పశ్యామిత్వాం దీప్తహుతాశవక్త్రం

స్వతేజసా మిశ్వమిదం తపంతమ్ (భగవద్గీత, అ-11, శ్లో. 119)

అర్థం : నీవు ఆది మధ్యాంత రహితుడవు. అపరిమిత శక్తిశాలివి. అసంఖ్యాకములైన భుజములు కలవాడవు. సూర్యచంద్రులు నీ నేత్రములు అగ్నివలె నీ ముఖము ప్రజ్వరిల్లుచున్నది. నీ తేజస్సులో ఈ జగత్తును సంతప్త మొనర్చుచున్నావు. అట్టి నిన్ను నేను చూచుచున్నాను.

ఆంజనేయుడు సీతజాడ కనుగొని తిరిగి రామునికి చెప్పుటకు పోవుచు కొద్దిగా కలహము పెంచుకొని రాక్షసుల శక్తిని పరిశీలింపబోయి ఎందరో రాక్షసులను, జంబుమాలి, మంత్రికుమారులను, సేనాపతులను,

హతమార్చెను. రాక్షసులు ఎందరో కాని **మారుతి మాత్రం ఒక్కడే. మారుతి తన విశ్వరూపము ప్రదర్శించెను.** అపరిమిత శక్తితో వారందరితో పోరాడి హతమార్చెను. రాక్షస వీరులు లెక్కలేనంతమంది ఆంజనేయునితో తలబడగా వానరుడొక్కడైనను అసంఖ్యాకములైన భుజములు కల్గిన వానిలా అందరిని హతమార్చెను. మారుతి నేత్రములు సూర్యచంద్రులలా ప్రకాశించెను. శత్రు కూటమైన రాక్షసులపై తన చూపుతో వేడిని ప్రవహింపజేసి ఆ అగ్నిలో ఎందరో అసురులు మిడతలోవలె దహింపబడినారు.

రావణాసురుడు మారుతి బలమును చూచి ఆశ్చర్యపరుడై తన కుమారుడైన అక్ష కుమారుడని మారుతిపై దాడికి పంపెను. అక్ష కుమారుడు చాలా బలవంతుడు. ఎన్నో దివ్యాస్త్రములు పొందిన తేజోవంతుడు. అతడు తన దివ్య రథముపై హనుమంతునిపై దాడి చేసెను. తన వాడియైన బాణములతో పవన కుమారిని ఛాతీకి రక్తము చిందేటట్లుగా గాయపరిచెను. మారుతి దానికి దిగులు పడక సమానముగా దాడి చేసెను. ఇరువురు ఘోరముగా యుద్ధము చేయగా హనుమంతుని దెబ్బలకు అక్ష కుమారుడు బలహీనుడగుట మారుతి గమనించి **అక్ష కుమారుడు నవ యవ్వనుడని బాలుడని అటువంటి బాలుని చంపుట తగదని భావించి హనుమంతుడు దయతో అక్ష కుమారుణ్ణి వదిలెను.**

సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకు శరణంవ్రజ

అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచు (భగవద్గీత, అ-18, శ్లో.66)

అర్థం : సర్వ ధర్మములను అనగా సమస్త కర్తవ్య కర్మలను నాకు సమర్పింపుము. సర్వశక్తిమంతుడను, సర్వాధారుడను, పరమేశ్వరుడను అయిన నన్నే శరణుజొచ్చును. అన్ని పాపములనుండి నిన్ను నేను విముక్తుని కావించెదను.

ఆంజనేయుడు బాలుడైన అక్ష కుమారుని చంపుటకు చేతులురాక తన మనోస్థితిని తిరిగి చూపించి మౌనముగా ఉండెను. బాలుని చంపుట అధర్మమని జాలిపడెను. కాని అక్ష కుమారుడు మారుతిపై కలయపడెను. మారుతి జాలిపడుట కూడదని గ్రహించి తన సర్వధర్మములను అనగా సమస్త కర్తవ్య కర్మలను తన ప్రభువైన శ్రీరామునికి సమర్పించి రాముని శరణుజొచ్చి ఆంజనేయుడు తన పిడికిలితో అక్ష కుమారుణ్ణి రథమునకు నున్న అశ్వమును కొట్టి రథము క్రింద పడునట్లు చేసి ఆ రథముతోపాటు అక్షకుమారుణ్ణి రెండు ముక్కలుగా త్రుంచి విసిరివేసెను. **ఆంజనేయుడు తన సర్వ ధర్మములను శ్రీరామునికి సమర్పించుటచే రాముడు అన్ని పాపములనుండి మారుతిని తప్పక విముక్తిని గావించెదరు.** అక్ష కుమారుని మరణవార్త విని రావణాసురుడు ఎంతో దుఃఖించెను. తన మరియొక కుమారుడైన ఇంద్రజిత్తును మారుతిపై దాడికి పంపెను.

రావణాసురుడు తన కుమారుడైన ఇంద్రజిత్తులో ఇట్లనెను. "ఆ వానరుడు సామాన్యమైన వానరుడు కాదు. ఎందరో అసుర వీరులను జాంబమాలితో సహా హతమార్చినాడంటే ఆ వానరుడు అసమాన్యుడు. కావున ఆ వానరుణ్ని బంధించి నా ముందుకు తీసుకురమ్ము" అని ఆజ్ఞాపించెను. **రావణాసురుడిలో**

**భయం తెలియకుండానే ప్రారంభమయ్యేను.** ఎందుకంటే మారుతి ఒక్కడైనను 80 వేల కింకరవీరులను, జంబుమాలిని, మంత్రి కుమారులను సేనాపతులను, అక్ష కుమారునితో సహా సంహరించినాడు. **కావున ఆ వచ్చిన వానరుడే అంత వీరుడైన రామలక్ష్మణులు ఎంతో వీరులో కదా అనే ఆందోళన రావణాసురుడికి కల్గెను.** పైగా అటువంటి వీరుడైన వానరుణ్ణి చూడవలెనని కాంక్షకూడాలోన కల్గియుండుటచే రావణాసురుడు ఇంద్రజిత్తుతో **మారుతిని బంధించి తీసుకురమ్మని పంపెను.**

ఇంద్రజిత్తు సామాన్యమైన వీరుడు కాదు సాక్షాత్తు బ్రహ్మదేవుని వరము వలన దివ్యాస్త్రములను పొందిన ఘనుడు. తండ్రివలె శక్తి సంపన్నుడు. తన తండ్రి ఆజ్ఞను శిరసావహించి హనుమంతునిపై యుద్ధమునకేగెను. ఇంద్రజిత్తు మారుతిపై వరుసగా శరముల వర్షం కురిపింపగా ఆంజనేయుడు వాటిని తప్పించుకొన యత్నించెను. ఇరువురు వీరులే. మహాబల పరాక్రమశాలులే. ఇద్దరిలో ఎవ్వరు తీసిపోలేదు. ఇద్దరి నడుమ భీకర యుద్ధము కొనసాగెను. వారిరువురిలో గెల్పు ఎవ్వరిదో ననే ఆశతో దేవతలతో సహా పొంచియున్నారు. ఇంద్రజిత్తు ధాటికి మారుతి తన శరీరము పెంచి ఇంద్రజిత్తు వేసే శరములకు ఓర్చుకొనుచు ఎదుర్కొనుచుండెను. ఇంద్రజిత్త బ్రహ్మాస్త్రమును మారుతిపై చివరకు వదిలెను. మారుతి ఆ బ్రహ్మాస్త్ర ప్రభావముచే బంధింపబడి క్రిందపడెను. కట్టుబడి ఉన్న మారుతిని చూచి రాక్షసవీరులు తమకు వానరుడు లొంగెనని దగ్గరకు చేరి చీరలతో తిరిగి మారుతిని బంధించిరి. ఆంజనేయుని స్మరణముచే బ్రహ్మాస్త్ర బాధయే తొలగిపోయెను. కాని అసురులు నార చీరలతో బంధించిన బంధములు అట్లే ఉండుట గమనించిన దానవులు వారి బంధనలకు లొంగెనని అజ్ఞానముతో తలంచినారు. రాక్షసవీరులు పవనకుమారుణ్ణి దూషణలాడి ఆంజనేయుని తమ రాజైన రావణాసురుని కడకు ఈడ్చుకొని తీసుకుపోయినారు. దారిలో దానవులెందరో వారికిష్టమొచ్చినట్లుగా దూషణములాడి కొందరు మారుతిని చంపి భక్షించమని సలహా ఇచ్చినారు. ఆంజనేయుడు తన అంతఃకరణము నిగ్రహముతో ఇంద్రియములను వశపరచుకొని శ్రీరామచంద్రునికి తానిచ్చిన మాట సీతజాడ కనుగొని వచ్చెదనని జ్ఞప్తికి చేసుకుని తన ధర్మమును పాటించుటకై అసురులకు లొంగినట్లు నార చీరలకే బంధింపబడినట్లు తనకు కల్గిన కష్టము సహించి అసురుల దూషణములకు బాధపడక వారి అపరాధములను క్షమించి తన మనోస్థితిని మరియొకసారి చూపించి నిశ్చలుడై నిర్మలత్వముతో స్థిత ప్రజ్ఞతతో మెలిగనాడు ఆంజనేయుడు.

శయోదమస్తపః శౌచం క్షాంతిరార్జవమేవచ

జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మస్వభావజమ్ (భగవద్గీత, అ–18, శ్లో. 42)

అర్థం : అంతఃకరణ నిగ్రహము, ఇంద్రియముల వశమునందుంచుకొనుట, ధర్మములను పాటించుటలో ఎదురగు కష్టములను సహించుట బాహ్యాభ్యాంతరముల శుచిత్వము, ఇతరుల అపరాధములను క్షమించుట, మనశ్శరీరేంద్రియముల సరళత్వము, విశ్వాసము కలిగియుండుట మొదలగు వన్నియు స్వాభావిక కర్మలు.

ఆంజనేయుడు సీతజాడ కనుగొని తిరిగి మరలి వెళ్ళునప్పుడు రావణుని శక్తి పరీక్షించుటకు రాక్షసులతో కలహము పెంచుకుని రాక్షసుల బలమును తెల్సుకొనుటకు మరియు రామునికిచ్చిన మాట ప్రకారము

సీతజాడ మాత్రమే తెలుసుకుని చెప్పుటకై అంతమంది రాక్షస వీరులను చంపిన వానరులు ఇంద్రజిత్తుకు లొంగినట్లు నటించెను. మారుతి తన శమము మరియు దమము చూపి తన ధర్మమును పాటించుటకు కష్టములనెదుర్కొనుటే కాక రాక్షసవీరుల దూషణములకు వారుచేసిన అపరాధములకు క్షమించి రావణాసురుని చూచుటకై ఎత్తువేసి నారచీరలకై తాను బంధింపబడినట్లు నటించి రాక్షస రాజైన రావణాసురుని కలువుటకై సిద్ధమైనాడు.

రాం రామాయనమః

# అధ్యాయము - 19

శ్రీ రామ రామ రామ

రాజారామ్

సనత్కుమారో వతు కామదేవా

ద్ధయాస్యమూర్తిః పథిదేవహేలనాత్

దేవర్షి వర్యః పురుషార్చ నాంతరాత్

కూర్మో హరి ర్మాం విరయా దశేషాత్ (నారాయణ కవచం)

అర్థం : సనత్కుమారుడు నన్ను రక్షించుగాక. దేవహేళనము నుండి హయగ్రీవుడు నన్ను రక్షించుగాక. నారాయణార్చనము దక్క అన్యదేవతార్చనము నుండి దేవర్షి నారదుండు నన్ను రక్షించుగాక. అధోలోకములందు నేను అధర్మాచరణము చేయకుండా కూర్మావతారమూర్తి నన్ను రక్షించుగాక.

ఆంజనేయుని రావణాసురుని సభలో ఈడ్చుకుని వచ్చిరి. బంగారు సింహాసనముపై ఆశీనుడైన రావణుడు రత్న కిరీటమును మరియు మణిమాణిక్యములతో నవరత్నములతోనున్న ఆభరణములను ప్రకాశవంతమైన పీతాంబరములు ధరించి ఎంతో తేజోవంతుడై ప్రకాశించుచున్నాడు. ఆ రాక్షస రాజుకిరుప్రక్కల అప్సరసలవంటి సుందరాంగుల వింధ్యామరలు చేతపట్టి రావణునికి వీచుచున్నారు. ఆ సభ మంత్రివర్యులతోను ఎందరో రాక్షస వీరులతోను క్రిక్కిరిసియున్నది. అటువంటి సభలో మారుతి మధ్య నిలబడి రావణుడి తేజమును చూచి ఆనందించినాడు మారుతి. మంత్రివర్యులు బంధింపబడిన మారుతినిగని ఇట్లనినారు, “నీవెవరవు ? ఎవరు నిన్ను పంపగా ఈ లంకకు వచ్చినావు ? ఇంతటి భీభత్సము చేయుటకు గల కారణమేమి ? నిజము చెప్పినచో నిన్ను వదిలి వేయుదుము” అని మంత్రివర్యులు హనుమంతునితో సభాముఖమున ప్రశ్నింపగా ఆంజనేయుడు వారితో ఇట్లనెను, “నేను శ్రీరామదూతను. నా పేరు హనమంతుడు. మా వానరరాజైన సుగ్రీవునికి మంత్రిని. సీతామాత లంకలో బంధింపబడియున్నదని తెలుసుకొని సీతజాడ తెలుసుకొనుటకు మిమ్మల్నందరిని పలకరించిపోవుటకు ఇక్కడు వచ్చినాను” అని

మారుతి ధైర్యముతో సభాముఖమన జవాబు పలికెను. ఆంజనేయుడు ఎటువంటి అసత్యము ఆడలేదు. ఎంతో ధైర్యముగా తాను లంకలో ప్రవేశించుటకు గల కారణము ఉన్నదున్నట్లుగా సత్యమే పలికినాడు. అందరి రాక్షసుల యెదుటపైగా రాక్షసరాజైన ఆ లంకేశ్వరుని ఎదుట నిలబడి ధైర్యముతో సాహసించి నిజము పలికినాడు. **మారుతి మనోస్థితి చాలాగొప్పది. తాను తలుచుకొన్న రాక్షస వీరులను మట్టిలో కలిపే శక్తి ఉన్నను రావణాసురుడు రాముని చేతిలోనే మరణించవలెనని సీతామాతను శ్రీరాముడే రావణుడిని జయించి సీతను అయోధ్యకు తీసుకువెళ్ళవలెనని శ్రీరాముని కీర్తికి ఎటువంటి అంతరాయము కలుగకూడదని లంకకు వచ్చిన పిదప రాక్షస వీరుల శక్తిని గ్రహించుటకు రావణాసురుని ముందు ముఖాముఖి చేసుకొనుటకు ఉద్దేశ్యముతో సభామధ్యమున అశక్తుడై ఉన్నట్లు నటించెను కాని హనుమంతుడు తలచుకొనిన లంకమట్టిలో కలసిపోవుట తథ్యము.** మారుతి తాను బంధింపబడిన తరువాత కూడా తాను రావణుడి ముందు **"మిమ్ములను పలకరించి పోవదలచితిని"** అని అనుటలో **హనుమంతునికి తన కార్యముపై ఎంత విశ్వాసమున్నదో తెలియుచున్నది.** ఇప్పటికి కూడా తాను ఆ రాక్షసులను జయించి రావణుని ఎదుర్కొని తిరిగి వెళ్ళగలిగే శక్తి తనకు ఉన్నదనే నమ్మకము చేతనే "మిమ్ములను పలుకరించి పోదలచితిని" అనే మాట ఎంతో ధైర్యముగా మారుతి పలికినాడు.

ఆంజనేయుని శక్తిని చూసి రావణుడు ఆశ్చర్యము చెందినాడు. సాక్షాత్తు ఈశ్వరుడే వానరుడి రూపమున వచ్చి తాను కైలాసమును పెకలించుటచేత ఈ రూపమున ఈశ్వరుడు వచ్చి తనను శపించునేమోనని భయపడినాడు. మారుతి నిజరూపమును తన రాకను గురించి తిరిగి అడుగమని రావణాసురుడు పలికెను. రావణుడి ఆజ్ఞ ప్రకారము ప్రహస్తుడు ఆంజనేయునితో ఇట్లనెను, "అతీతమైన శక్తి సంపన్నుడవు, దివ్యకాంతితో వెలుగుచున్న నీవు సామాన్యమైన వానరుడవు కావు. నిజము పలుకుపము. ఎవరు నిన్ను మాపై యుద్ధమునకు వదిలినారు. యముడా ? కుబేరుడా ? ఇంద్రుడా ? లేదా విష్ణుదేవుడా ? నిజము పలికినచో బ్రతికిపోవుదువు. లేనియెడల మాచేత హింసలకు లోనగుదువు" అని మారుతిని ప్రశ్నింపగా తిరిగి మారుతి ఇట్లనెను, "నేను ఎవరి దూతనుకాను. సహజమైన వానరుడను. సాక్షాత్తు శ్రీరామచంద్రుని దూతగా వచ్చినాను. రాక్షసరాజైన రావణాసురుణ్ణి చూచుటకు ఇట్లు చేసినాను. అశోక వనమున తల్లి సీతామాతను చూచి జాడ తెలుసుకొని ఆ సుందర వనమును ధ్వంసుచేసి రాక్షస వీరులను హతమార్చినాను. కారణం ఆ లంకేశ్వరునితో సంవాదము కోసమే. దశరథుని పెద్ద కుమారుడైన శ్రీరామచంద్రుడు తన తండ్రిమాట నిలబెట్టుటకై తన సతితోను, సోదరునితోను రాజ్యమును వీడి 14 యేండ్లు వనవాసము చేయుటకై వచ్చినాడు. రామలక్ష్మణులు లేని సమయమున రావణుడు సీతను అపహరించినాడు. రామలక్ష్మణులు సీతజాడకై అరణ్యములో వెతుకుచూ మా వానర వీరులను కలిసినారు. వానర రాజైన సుగ్రీవుడు శ్రీరామునితో స్నేహముకోరి తల్లి సీతజాడను కనుగొనెదమని సుగ్రీవుడు రామునిముందు ప్రతిజ్ఞ చేసినాడు. రామకార్యమునకై మా వానరవీరులందరూ సీత జాడ కనుగొనుటకు నలుదిశలా వెళ్ళినారు. నేను శతయోజనములు గల వారధిని దాటి ఈ లంకకు ఒంటరిగా ప్రవేశించి లంక మొత్తము సీతకై వెతికి చివరకు అశోక వనమున తల్లి సీతను గాంచితిని. నన్ను మించిన వానరులెందరో మాతో ఉన్నారు. కావున ఓ మహారాజా! శ్రీరామునితో వైరము తగదు. సాక్షాత్తు మహావిష్ణువు అతడు. ధర్మమును ఎరిగినవాడవు

